# పశ్చాత్తాపము

కురుమెళ్ల వేంకటరావు.

# పశ్చాత్తాపము.

కురుమెళ్ల వేంకటరావు.

ఉపాధ్యాయుఁడు.

శ్రీరాజా భావయమ్మారావు హైస్కూలు.

పిఠాపురము.

మొదటికూర్పు.

1932

 [వెల రు. 0-6-0

"Brother!!

There is nothing more beautiful in the world than a truly repented soul.

To know this is to know ourselves and our God."

*T. P.*

# FOREWORD.

This book contains seven interesting stories written in simple style. It may be used a non-detailed text book in Telugu for the lower forms. The author is a promising young teacher deserving all help and encouragement.

R. R. BH. R. HIGH SCHOOL
**PITHAPURAM,**
25-7-1932.



**N. RANGACHARY,**
M. A., L. T.,
*Head Master.*

# మున్నుడి.

---

మానవజీవితము కలుషదుర్బలము. పాపము లొనరించుట దానికి స్వభావసిద్ధము. లోభమో, మోహమో చెలరేఁగి దాని నట్టూఁత లూఁచివేయును. ఒక దుష్కృత్యమునకు, యొక హింసాకర్మమునకు, యొక రక్తపాతమునకు, మానవుఁడు లోభమోహావిష్టుఁడై, యున్మత్తుఁడై చేసివేయును. కోరికలతోఁ దల్లడిల్లుచుండును. క్రోధముచే మండిపోవుచుండును. మదముచే బిఱ్ఱదిరిగిపోవును. ఇట్టి యవస్థలో భగవత్కటాక్షలేశమున హృదయమున నెచ్చటనో యొక జ్యోతి తళుక్కు మనును. తోడనే కన్నులువిప్పి వెనుదిరిగి చూచుసరికి తన భయంకరఘాతుకకృత్యములు, హింసలు, ననంతపాపములును దమ కరాళజిహ్వల నప్పళించుచు మ్రింగఁ జూచునట్లగపడును. మానవుఁడా భయదదృశ్యమును జూడలేక భయకంపితుఁడై కన్నులుమూసికొని పతితపావనుఁడగు భగవంతుని బ్రార్థించును. ఆ పరిశుద్ధాత్మ కన్నులవెంటఁ బవిత్రములగు నుష్ణాశ్రువులు జాలువారును. అదియే పశ్చాత్తాపము.

ఆ యమృతాశ్రుమాధుర్యము నెఱిఁగిన వారు మహితానుభావులగు జీసస్, బుద్ధుఁడు మొదలగువారు. వీరు "పతితులను జూడరాదు. వెలిపెట్టవలె" నను మొఱకు సిద్ధాంతముల వారు కారు. "పాపములు మానవసాధారణములు. పశ్చాత్తప్తు

లగు పతితుల నుద్ధరించుటయే ప్రేమమూర్తి యగు భగవంతుని కిష్టము" ని నమ్మిన విశాలహృదయులు. వీ రిట్లొందఱినో పాపాత్ముల నుద్ధరించిరి. దానికిఁ దార్కాణ మీకథాగుచ్ఛక మందలి 'పాపిని—జీసస్,' 'అహింసకుఁడు—బుద్ధుఁడు' ను, నను కథాద్వితయము.

చూడుఁడు. జీసస్ పాపినితో నే మనుచున్నాఁడో! "నేను మాత్ర మెందులకు నిందింతును! నీవు పశ్చాత్తాప మొందితివి. కావున పాపము లెల్ల నశించినవి. పొమ్ము. ఇఁక నెన్నఁడును పాప మొనరింపకుము". వేయిమంది యనపరాధులఁ జంపి తద్రక్తములోఁ బొరలాడిన పాపపంకిలుఁ డగు నహింసకుని "గౌతమబుద్ధుఁడు లేవ నెత్తినాఁడు. కౌఁగిటఁ జేర్చికొన్నాఁడు". అట్టి పతితపావనుఁ డగు బుద్ధభగవానుని వలనఁ "పరమక్రూరుఁ డైన నరహంత యిప్పుడు పరమసాధు భిక్షుకుఁ డైనాఁడు." కావున నిజముగాఁ బశ్చాత్తాప మందిన నిర్మలాత్మకంటెఁ బవిత్ర మైన వస్తు వింకొకటి లే దని చెప్ప వచ్చును. పాపము లొనరించినందుల కంతగా భగవంతుఁడు కోపింపఁడు. కాని పాప మొనరించి పశ్చాత్తాప మందని పరమ కలుషాత్ముని నెన్నఁడు క్షమింప నేరఁడు.

పశ్చాత్తాప మందలి పరమార్థమును గుఱించి యీ గ్రంథకర్త యేగురు పశ్చాత్తప్తుల పవిత్రకథలను చక్కఁగా రచించెను. అందు "అహింసకుఁడు—బుద్ధుఁడు, చిన్నకొడుకు—తండ్రి, వాల్మీకి—బాలిక, అశోకుఁడు—యుద్ధభూమి" అను కథలు కడు రసవంతములై యొప్పాఱు చున్నవి. వాల్మీకికథ యందలి మామూలుగాఁ జెప్పికొనువిధముగాఁ గాక యిందు

మార్పునందినది. ఒకరియుపదేశముకంటె స్వపశ్చాత్తాపమే మానవుని బవిత్రునిజేయు నని కాంబోలు మార్పుటలోని యాశయము. తత్త ద్రసానుగుణమైన భాషయు భావములును నిందు సమంజసముగ నెలకొనినవి.

బాలురకు శాస్త్ర మనిన నెంతకష్టమో కథ లనిన నంత యిష్టము. కనుక వారికిష్టమగుపథమున మన ముపదేశింప వలసిననీతులను, సహింస, సత్యము మొదలగు సద్గుణములను బోధించి వారి లేతమనస్సున నాటుకొను నట్లు చేయుటమంచిది. తమ యధ్యాపనానుభవమున నీ విషయమును గమనించి బాలురరుచి ననుసరించి సుబోధముగ నస్మన్మిత్రులగు వేంకటరావుగారీ కథాగుచ్ఛకము నుపనిబద్ధించిరి. కథలలో బాలురకుఁ గావలసిన విజ్ఞానమును గలిపి వారిహృదయములువికసింపఁ జేయుట వీరిముఖ్యోద్దేశము. కావుటఁబట్టియే వీ రింతకుమున్ను రెండు కథానకపుస్తకములఁ బ్రకటించిరి. నేఁడు మఱియొక కథాగుచ్ఛకమును నాంధ్రబాలుర కందించి వారి విద్యావికాసమున కెంతయుఁ దోడ్పడుట ప్రశంస్యము.

మఱియుఁ గథాగుచ్ఛకాంతరములకంటె వీరి యీగుచ్ఛమున నొక విశేషముకలదు. ఎంతసేపును మనవారు పాడినదే పాడి విసువు పుట్టించి బాలురను విముఖులఁ జేయుదురు. వేంకటరావుగారు క్రొత్తకథల నిందుఁ బొందుపఱచి పిల్లల సుముఖులఁ జేసికొనిరి. దీనిని మంచిమనసుతోఁ బరికించి బాలుర కుపయోగింపఁ జేసినచో నీ కృతికర్త కృతకృత్యుఁడగును.

రాజమహేంద్రవరము,
౨౮—౭—౧౯౩౨.

ఉభయభాషాప్రవీణ
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి.

# కథలు.



'రివ్వునఁ గొమరునివైపు బరుగెత్తెను. రెండుచేతుల నతనికై చాచెను. గాఢముగఁ గౌఁగిలించుకొని..."

పుట. 5

# పశ్చాత్తాపము

## చిన్నకొడుకు—తండ్రి.

౧

ఒకధనికునకిరువురు కొడుకులు కలరు. వారల నిద్దఱ నాధనికుఁ డొక్కతీరునఁ బ్రేమించుచుండెను. ఆయిరువురలో రెండవవాఁడు మిక్కిలి దురుసుదనముఁ గలవాఁడు. అతఁ డొక దినమునఁ దొందరపడి తండ్రియొద్ద కేఁగి "తండ్రీ! నేను బాల్యమును గడచి పెద్దవాఁడ నైతిని. కావున మనయాస్తిలో నాకు రాఁదగిన భాగమును నాకుఁ బంచియిమ్ము" ని నిర్బంధించి యడిగెను.

తండ్రి చాల దయగలవాఁడు. కొమరునికోరిక నిరాకరింపక వెంటనే యాతనిభాగముఁ బంచి యిచ్చివేసెను. కుమారుఁ డాధన మంతయుఁ దనవశముఁ జేసికొనెను. పిమ్మట నతని కాయూర నుండుట కిష్టము లేక దూరదేశమున కేఁగి యచ్చట స్వేచ్ఛగా సంచరింప వలయునని యెంచి మఱియొక యూరికిఁ బ్రయాణ మయ్యెను.

తనవంతువచ్చిన సొత్తంతయు నాతఁడు తనవెంటఁ గొనిపోయినాఁడు. అచ్చట విచ్చలవిడిగాఁ జరింప మొదలుపెట్టి నాఁడు. ధనికుఁడగు నాయువకుఁ డొంటరిగఁ బరదేశమున నుండుట తటస్థించినపు డెట్లు ప్రవర్తించునో వేఱె చెప్పవల యునా? దుర్జనసహవాసముఁ జేసినాఁడు. పరస్త్రీలవెంటఁబడి నాఁడు. త్రాగుఁబోతయి ధనమంతయు వ్యయ మొనర్చి నిఱు పేదయైనాఁడు.

చేతిలోనిసొమ్మంతయుఁ జెల్లిపోయెను. తినుట కన్నముఁ గట్టుకొనుటకు గుడ్డయు లేక మిక్కిలి హీనదశ నొంది యేమి చేయుటకును దోఁచక బిచ్చివానివలెఁ దిరిగితిరిగి సేవకావృత్తి చేసియెనఁ బొట్టఁ బోషించుకొనవలయుననియెంచి తుద కొక సేద్యగానియొద్దఁ గొలువు సేయుటకుఁ గుదిరెను. ఆకృషికుఁడు తనయొద్దనున్న పందులగుంపును గాయుటకై యాతని నియ మించెను.

పాపము. ఆగర్భశ్రీమంతుఁడు పందులకాపరి యయ్యె ను. భోజనమా కడుపునిండలేదు. పందులతోఁబాటూకయుఁ బొట్టునైనఁ దిని బ్రతుకవచ్చునని యతఁడు తలఁచెను కాని యవిమాత్ర మాతని కెట్లు లభింపఁగలవు?

ఆతఁడు పందులను గాయుచు నొడలినిండఁ బట్టయైన లేక చినిఁగినపీలికలు గట్టుకొనియుండెను. చేయునది నీచమైన పని. వచ్చునదిమిక్కిలి తక్కువజీతము. కడుపునిండఁ దిండి

లేదు. మఱలమఱల నధికారికిఁ గనఁబడి తనదరిద్రస్థితిఁ జెప్పు కొనుట కభిమానము. ఆఁకలిబాధ భరింప శక్యము గాకుం డెను. ఒడలికి స్నానసంస్కారము లేవియు లేవు. తలయుం తయుఁ జిక్కువడిపోయెను. మిక్కిలి రోగపీడితుఁడయి శల్యా వశిష్టుఁ డయ్యెను. వెనుకటికళకాంతు లెక్కడి కేఁగెనో కాన రావు.

ఆతఁ డొకదినమునఁ బందులయెదుటఁ గూర్చుని యుండి తనదుస్థితి కెంతయు వగచుచుఁ బూర్వవృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుండ నంతలో నాతనిమనసులోఁ దటు క్కున నొక్క మెఱపు మెఱసెను. తా నెవఁడో, తనగ్రామ మేదియో, తా నిట్లగుటకుఁ గారణమేదియోయని యాలో చించుకొనునప్పటి కింకొక మెఱపు మెఱసెను. అతనిహృదయ మున నాశయు ముఖమునఁ గాంతివికాసములును బొడసూపినవి.

,, అహో! నాతండ్రి యెంతమంచివాఁడు. నన్నపరి మితముగఁ బ్రేమించినాఁడే! మాగృహవైభవము లెన్నఁటికైన మఱువఁ దగునే? ఎడతెఱపిలేని నిత్యోత్సవములు గన్నులఁ దనుపుచుండెడివిగదా! నాతండ్రియొద్ద నెందఱో పనిసేయుచు సర్వకాలసర్వావస్థలయందును సుఖముగఁ గాలక్షేపముఁ జేయు చుందురు. వారలు కడుపునిండ భుక్తియు నొడలినిండ వస్త్రము లును గలిగి యితరులకుఁగూడ సమృద్ధిగఁ బెట్టఁగలుగుచున్నారు. అకటా! నేనిచ్చట నాఁకలిచేఁ జావనేల? ఈక్షణమందే నా

తండ్రియొద్దకుఁ బోయెదఁగాక. అతఁడు కరుణార్ద్రహృదయుఁడు. నన్నాదరింపకపోఁడు. అతనియొద్ద కేఁగి 'తండ్రీ! నేను నీయెడలను భగవంతునియెడలను గొప్ప యపచారముఁ గావించితిని. నేనునీకొడుకు ననిపించుకొనుటకుఁగూడ దగనివాఁడను. నే నొనరించినతప్పిదము నీవు క్షమించుటకు వీలుకానిది. కావున నే నొకటి కోరుకొనెదను. నీకడ నెన్నియో వందలమందిజనులు కొలువు సేయుచున్నారుగదా! వారిలో నొక్కనికి నీ విచ్చు నంతజీతము నా కిచ్చి నన్నొకపనిలో నియోగింపుము' అని ప్రార్థించినయెడల నిరాకరింపఁడు."

ఇట్లూహించుకొనునప్పటి కాతని మనసులో నొక క్రొత్తయానంద ముదయించెను. కాలుసేతులలో మున్నెన్నడునులేనిబలము కలిగెను. దిగ్గున లేచెను. ఎవ్వరితోడను నేమియుఁ బలుకలేదు. తనభావిసుఖములను మననముఁ జేసికొనుచు వడివడిగఁ దనదేశమువైపు నడచెను. అనతికాలములోనే తన యూరుఁ జేరుకొనెను. మెల్లగాఁ దనతండ్రియున్న ప్రాంతమున కేఁగెను.

౨

తండ్రి యాతని దూరముననే కాంచెను. ఆతఁ డెంత మాఱురూపుఁ జెందియున్నను గుమారుఁడని వెంటనే గ్రహించెను. ఆతనిమనసున నాత్రము జనించెను. కొడుకునందలి ప్రేమాతిశయమున నాతనిశరీరము కంపించెను. కన్నులనుండి

యానందాశ్రువులు రాలెను. రివ్వునఁ గొమరునివైపు బరుగెత్తెను. రెండుచేతుల నతనికై చాఁచెను. గాటముగఁ గౌఁగిలించుకొని, యాతనిమూర్ధ మాఘ్రాణించి ముద్దిడుకొనియెను.

కొడుకు "నాయనా! నేను భగవంతునియెడలను నీయెడలను ఘోరమైనపాప మొనరించి యుంటిని. నీకుమారుఁడ ననిపించుకొనుట కిఁక నాకు యోగ్యత లేదు. నన్ను క్షమింపకుము" ని బిగ్గఱగ నఱచెను.

తండ్రి, సేవకులను బిలచి "ఈతఁడు నాప్రియసుతుఁడు. కొన్నిదినముల క్రిందట నీతఁడు చనిపోయి మఱల నిప్పుడు బ్రదికివచ్చినాఁడు. చేయిజాఱి యగాధసముద్రమునఁ బడిన యీ నాతనయుఁడు నాయదృష్టమునఁ దిరిగి నాకు లభించినాఁడు. మీరు వెంటనే విలువగలబట్టలను దీసికొనివచ్చి యీతనికిఁ గట్టనిండు. అమూల్యములైన యాభరణముల నీతనికిఁ దొడుగుఁడు. మంచిపాదరక్షల నీతని కొనగుఁడ" ని యాజ్ఞాపించెను. అతఁడత్యంత సంతోషమున బంధుమిత్రుల నందఱను రావించి విం దొనరింపసాగెను.

ఇంతలోఁ బెద్దకొడుకు పొలములోనుండి గృహాభిముఖుఁడై చనుదెంచి తమయింట జరుగుచున్న సంగీతములు, నృత్యములు, విందులు, మొదలగువైభవము లన్నియుఁ జూచి మిక్కిలి విస్మితుఁడై యాసమీపమునఁగల సేవకు నొక్కనిఁ బిలచి "యిచ్చటికోలాహల మేమి" ని యడిగెను.

"కొంతకాలము క్రిందట మిమ్ము విడనాడిపోయిననీ సోదరుఁ డిప్పుడు సురక్షితముగ నింటి కేతెంచినాఁడు. అందులకై మీతండ్రి మనయూరనున్న పెద్దల కందఱకు విందొనరించుచున్నాఁడ" ని సేవకుఁడు పలికెను.

ఈమాటలు వినునప్పటికిఁ బెద్దకొడుకున కెంతయుఁ గోపము వచ్చినది. ఆతఁ డింటిలోనికిఁ బోవుట కిష్టపడలేదు. బయటనే నిలువఁబడియుండెను. తండ్రి కాసంగతి తెలియవచ్చినది. వెంటనే యాతఁ డీవలకు వచ్చెను. కొమరుని లోనికి రమ్మని ప్రతిమాలెను. కుమారుఁ డత్యంతరోషముతో నిట్లు పలికెను.

"ఇన్నినాళ్లనుండి నేను నీసేవఁ జేయుచున్నాను. ఎన్నఁడును నేను ని న్నెదిరించలేదు. నీమాట నెన్నఁడు జవదాఁటలేదు. నీమనసున కెన్నఁడైన రవంత కష్టముఁ గలిగించియుండలేదు. నీయాజ్ఞల నత్యంతభక్తిశ్రద్ధలతోఁ బరిపాలించితిని. ఇట్లుచేసినను నావిషయమై నీ వొక్కపుడైన నిట్టియుత్సవముఁ జేయింప నెంచితివా? నిన్ను రచ్చ కెక్కించి నీయింటిగుట్టు బయటఁబెట్టి త్రాగుబోతయి నీయాస్తిని వేశ్యల కర్పించిన యీ నీచిన్నకొడుకు వచ్చినతోడనే యింతయార్భాటముఁ గావించుచుంటివే. ఇన్నిభక్ష్యములను జేయించితివే. ఇన్ని యుత్సవముల జరిపించుచుంటివే" అని మహాక్రోధమునఁ బలుక ధనికుఁ డామాటలు విని "నాయనా, నీ వెల్లప్పుడును

నాకడనే యున్నాఁడవు. నాకుఁగల యాస్తి యంతయు నీదే కదా ! విడలిపోయిననీసోదరుఁడు మన కిఁక లేడనుకొనినవాఁ డిప్పుడు తిరిగి లభియించినాఁ డనఁగ మన మనముల కెంతయు సంతోష ముదయింపకుండునా ? దీని కనువగు నొక్క కార్క ణముఁ జెప్పెద నాలింపు" మని యిట్లు చెప్పఁ దొడఁగెను.

మహాత్ముఁడగు జీసస్ గొల్లవారియింటఁ బుట్టెను. ఆతఁడు పాపులను దనచెంతకుఁ జేర్చుకొని కాపాడినాఁడు. ఆతఁ డట్లు పాపుల రక్షించుచున్నందుల కతనిపై ఫారిసీలు మున్నగువారల కెంతయుఁ గోపము వచ్చినది. వారలు మొగములు చిట్లించుకొనినారు. పాపాత్ముల కాతఁ డాశ్రయము మిచ్చి వారితోఁ గలసి భుజియించుననని యాతని మిక్కిలి నిందించినారు. జీసస్ వారి కిట్లు సమాధానముఁ జెప్పినాడు. "అయ్యలారా ! మీరు నాపైఁ గినియక మన్నించి నావిన్నప మాలింప వేఁడెదను. ఒకగొల్లవానికి నూఱుగొఱ్ఱె లున్నవి: వానిలో నొకగొఱ్ఱె తప్పిపోయెను. గొల్లవాఁడు తక్కిన తొంబది తొమ్మిదిగొఱ్ఱెల నాయడవిలో విడిచి తప్పిపోయినయొక్క గొఱ్ఱెకై తిరుగకమానఁడుగదా: ఆగొఱ్ఱెయాతనికి దొఱకినప్పుడెంత యానందించునో వచింప శక్య మగునా ? మందనుండి [illegible] పోవనితొంబదితొమ్మిదిగొఱ్ఱెలుఁ దనయొద్దనుండునప్పటిసంతోషముకంటెఁ దప్పిపోయిన యాయొక్కగొఱ్ఱె తిరిగి లభించునప్పుడు కలిగెడి యానంద మాతనికి వేయిమడుంగు లధికముగదా ?

అతఁడు దానినిఁ దనభుజముపై నెక్కించుకొనును. మహానంద దమున నింటికిఁ దిరిగివచ్చి పోయినగొఱ్ఱె మఱల దొఱకినదని గంతు లిడుచుఁ దనయానందమున దోడివారలనుగూడఁ బాల్గొనఁజేయును.

సర్వరక్షకుఁడైన భగవంతుని యిచ్ఛ యదియే. సృష్టి యందలి యేవ్యక్తియును నశింపఁగూడదు.

పశ్చాత్తప్తుఁడైన పతితునిఁగూర్చి దేవుఁ డపరిమితా నంద మొందును.

పశ్చాత్తప్తుఁడగు నొక్కని భగవంతుఁడతి ప్రేమతోఁ దనహృదయమున కాదుకొనును. తక్కినతొంబదితొమ్మండు గురలోఁ బశ్చాత్తాపములేదుకావున వారాతనికంతగాఁ బ్రేమ పాత్రులు కాలేరు.

ఇదియునుఁగాక నింకొక విశేషము. ఒక తెకుఁ బది వెం డినాణెము లున్నవి. వానిలో నొకటి యామెచేతినుండి జాఱి పోయినది. మిగిలిన తొమ్మిదింటితో నామె తృప్తిఁ జెంది యూఱకుండదు. పెద్దదీపమునొకదానిని వెలిఁగించి వాకిలియం తయు వెదకి వెదకి దాని నామె గ్రహించి యానందించును. పోయినవస్తువులోనివిలువ యామెకుఁ దెలియును. పతితుఁడై పశ్చాత్తప్తుఁడైనయాతనికై భగవంతుఁడటులనే సంతసించును" అనియిట్లు జీసస్ వచించి తనవ్యతిరేకుల హృదయములను గఱఁ గించినాఁడు.

కావున నోతనయా ! నీయనుజుఁడట్లే పశ్చాత్తప్తుఁడై తిరిగి చనుదెంచినాఁడు. వానిపాపము లన్నియుఁ బటాపంచ లైనవి. నీ విఁక వానిపై దయఁ జూపుట కర్తవ్యము" అని బోధించి యాతనికోప ముడిపి లోనికిఁ గొనిపోయి తమ్ముని యొద్దకుఁ జేర్చెను.

చిన్నవాఁ డన్ననుగాంచి 'అన్నా, కన్నుఁగానక నే నెన్నియో పాపకార్యము లొనరించి తుద కిప్పుడు పశ్చాత్తప్తుఁడ నయితిని. కావున దయతో నన్ను మన్నింపవలయు' నని కన్నీటిధారలచే నన్నగారి పాదములఁ దడిపి యాతని మన్ననలకుఁ బాత్రుఁడయ్యెను.

# బాలుఁడు-దాది.

## ౧

ఒకదినమున నొకపట్టణపురాజవీధినుండి యొకఁ డొక గుఱ్ఱపుబండిని మెల్లగఁ దోలుకొనిపోవుచుండెను. అం దొక దొర సాని కూర్చుండియుండెను. ఆమె తెల్లని దుస్తులను ధరించి యుండెను. ఆమెతలపై నొక తెల్లనిగుడ్డటోపి యుండెను. బండి యొకసందుచివరకు వచ్చుసరి కొకప్రక్కనుండి శరవేగమున నొకఱాయివచ్చి యాదొరసానినుదుటిపైఁ బటుక్కునఁ దగి లెను. చుట్టుపట్టుల నెవ్వరును గాన్పింపరు. ఎనిమిదేండ్లబాలుఁ డొక్కఁడు మాత్ర మొకరాళ్లగుట్టయొద్దనుండి ప్రక్కసందు లోనికిఁ బరుగెత్తుకొనిపోవుచుండెను. చూచునంతలో నాతఁడు సందులో మాయమైపోయెను.

పాపము. దొరసానిముఖముపైఁ బెద్ద గాయమైనది. ఆగాయమునుండి జలజల రక్తము కాఱఁజొచ్చెను. ఆమె ధరిం చిన స్వచ్ఛమగువస్త్రములు రక్తముచేఁ దడిసిపోవుచుండెను. దెబ్బతగిలినతావున నామె చేతితో గట్టిగ నొక్కిపట్టుకొని యుం డెను. ఆమె తల తిరుగుచుండుటచేతఁ గాఁబోలును బండికిఁ జేర వైచినది. బండివాఁడు బండిని నిలిపి క్రిందికి దిగివచ్చి, అమ్మా! ఇప్పుడా ప్రక్కకుఁ బరుగెత్తుకొనిపోయినకొంటెపిల్లవాఁడే నిన్ను గొట్టియుండవచ్చును. వాని నొక్కనిమిసములోఁ బట్టు

కొని నీయొద్దకుఁ దీసికొని వచ్చెదను. నీ విచ్చట జాగ్రత్తగ నుండుము' అని యాతఁడు పోఁబోవుచుండెను.

,, వలదు. వల" దని యామె యాతని వారించి ,,బండి నెక్కుత్వరితముగఁ దోలు" మని యాతని కాజ్ఞాపించెను. బండివాఁ డేమియుఁ జేయలేక బండిని దోలుట కారంభించెను.

ఆబాలకుఁ డీమెనెందులకుఁ గొట్టియుండును? ఈమె యాతనికి కదివఱ కెన్నఁడైన నేమైన నపకారమొనరించి యుండునా? అట్లుజరిగియుండదు. తనకింతటిపెద్దగాయ మొనరించిన యాతఁ డెవఁడయియుండునో తెలిసికొనుటకైన నిష్టపడనిమంచి హృదయముగలయామె యాతని కె ట్లపకార మొనరించియుండును? దారినిఁ బోవుచుఁ బ్రక్కనున్న పసిపాపలను, కుక్కలు, దూడలు మున్నగువానిని నాగడమునఁ గొట్టుచుఁ బోవు బాలు రెందఱు లేరు? అటులే యాబాలుఁడును, వింతదుస్తులను ధరించి బండిలోఁ గూరుచుండినదొరసానిపైఁ గారణము లేకయే ఱాతిని విసరియుండవచ్చును.

౨

కొన్ని దినములు గడచిపోయినవి. ప్రజలదురదృష్టవశమున నొకప్పు డాయూర గొప్ప మశూచిరోగము సంభవించెను. దానివలన నెందఱోజనులు పురుగునాకినవిధమునఁ జనిపోవుచుండిరి. గ్రామమం దంతటను మిక్కిలి భయంకరముగ

నుండెను. "రోగగ్రస్తు లూరివెలుపలకుఁ బోయియుండవలయు" ననియు " లేకున్న శిక్షింపఁబడుదు " రనియు దొరతనమువారు ప్రకటించి రోగవ్యాప్తి నాఁపుటకై తగిన ప్రయత్నములఁ జేయించుచుండిరి. చాలమందిజనులు రోగుల నెందఱినో యూరువెలుపలకుఁ దీసికొనిపోయి యచ్చట వారిని సంరక్షించు చుండిరి.

ఒకదినమున నొకచెట్టుక్రింది కొకకుటుంబము చేరెను. నలువురుబిడ్డలుఁ దల్లియుఁ దండ్రియు నం దుండిరి. తల్లి పెద్ద కొడుకు నొడిలోఁ బెట్టుకొని కూర్చుండియుండెను. ఆబాలుఁడు నుమా రెనిమిదేండ్లప్రాయమువాఁడు. ఆతనికి మశూచిరోగము సంభవించినది. ఆతనియొడలంతయు మశూచికపుఁ గుండలచేఁ గాలిపోయి నీరుపట్టిన ట్లుండెను. ఆతనినోటియందుఁ గండ్లలోను గూడ మశూచికపుఁగుండ లుండుటచే నీరుఁ ద్రాగుట కైనఁ జూచుట కైన వీలులేనంతటియవస్థయం దుండెను. అట్టిదుర్భర దృశ్య మాతని తలిదండ్రు లెన్నఁడును గనియెఱుంగరు. బాలుఁ డికఁ బ్రదుకుననెడియాశ వారల కెంతమాత్రము లేనందున నాతని నింట నుండి యిటకుఁ గొనివచ్చిరి. తక్కినబిడ్డల నింట నునిచివచ్చినచో వారినిఁ గాపాడువా రెవరును లేరని వారినిఁ గూడఁ దమవెంటనె కొనివచ్చిరి.

ఇచ్చటఁ బెద్దకొడుకునకుఁ గ్రమముగ వ్యాధిహెచ్చు చుటచేఁ దలిదండ్రులు తక్కినవారి నిఁకనిట నుండనిచ్చినచో

నెటుపోయి యెటువచ్చునోయని యెంచి వారి నింకొక చోటికిఁ గొనిపోవుటకు నిశ్చయించుకొనిరి. కాని, కని పెంచి పెద్ద వానినిజేసి తమతనయుఁ డింతటిదుస్థితిలో నున్నప్పుడు విడ నాడ నెంచునంతటి కఠినహృదయు లగు తల్లిదండ్రు లెందైన నుందురా? వారలు తనయుని విడనాడ సాహసింపరైరి. చేతు లార నాతనికిఁ జికిత్సలను జేయఁజాలరైరి. కంటికి మంటికి నొక్కటేధారగ నేడువఁ దొడఁగిరి.

కష్టసమయములయం దీశ్వరుఁడు ప్రత్యక్ష మగుచుం డును. ఆయూరిచివర నొక చికిత్సాగార ముండెను. మత ప్రచారకసభవారా యాసుపత్రిని నడుపుచుండిరి. దయాంత రంగులగు నా మిషనరీవారెందఱినోరోగులను గ్రహించి యా చికిత్సాగారమునకుఁ గొనిపోయి యుచితవైద్య మొనరించి సంరక్షించుచుండిరి. భగవత్కృపవలన నా వైద్యులు వీర లున్నస్థలమున కరుదెంచిరి. వెంటనే తలిదండ్రు లాబాలుని వారలయధీన మొనరించి తక్కినబిడ్డలతో స్వగృహమున కేఁగిరి.

ఒకదాది (Nurse) యాసుపత్రియం దా పిల్లవానిని సంరక్షించుట కేర్పడినది. ఆమె యాతని నొకనిమేషమైన విడిచి యుండక యాతనిపుండ్లయందలిచీము నొడిచివైచి వేఁడినీళ్లతోఁ దుడిచినది. పుండ్లపై నొకవిధమగు చూర్ణమును మెల్లగ నద్ది

నది. ఆబాలుఁడు వంశుకొనుటకుఁ బరిశుభ్రమైనపక్క నేర్పఱచినది. పాలను, పండ్లరసమును, చిన్నగరిటెతో నాతని నోటిలోఁ బోసినది. పాప మా దాది యనుమంతయు విసువక తల్లికన్న వేయిరెట్లెక్కువ ప్రేమతో నాబాలున కుపచారము లొనరించినది. క్రమముగ నాతనికి స్వస్థత కలుగఁజొచ్చెను. పుండ్లు మానుమొగము పెట్టినవి. నోటిలోఁ బోసిన ద్రవపదార్థములు నెమ్మదిగఁ గడుపులోనికిఁ బోవుచున్నవి. కొంచెము కొంచెమాతనికి బలము కలుగుచున్నది. బాధలు తగ్గుచున్నవి.

పాప మా నర్సు బాలుని మంచముపైఁ గూరుచుండి యాతనిచేతులు తనచేతులలో నుంచుకొని యుబుసుపోకకై నేవేవో కథలను జెప్పుచుండెడిది. ఆకథల నాలించుచుండినంతసేపా బాలుఁడు తనశరీరములోని బాధల నన్నిటిని మఱచిపోవుచుండెడివాఁడు. కన్నులింకను విప్పుటకు వీలులేకుండుటచే నతఁ డామెను గన్నులారఁ గాంచలేకుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచినవి. ఒకనాఁటియుదయమున దయామయయగు నా దాది యాతనికిఁ జేయవలసిన యుపచారము లన్నియుఁ జేసి యతనిప్రక్కను గూరుచుండి యేవేవో మాటలఁ జెప్పుచుండెను. మెల్లగ నాబాలుఁడు తన కనుఱెప్పల విప్పుటకుఁ బ్రయత్నించెను. కొంతవడికి ఱెప్పలు కొంచెము పైకి లేచినవి. కాని యామెను జూచునంతటిదృష్టి కలుగలేదు. అతఁడు తిరిగి నాఁటిసాయంకాలము కనుఱెప్పలఁ

గొంతవఱకు విప్పి చెంతనున్న దాదిని వీక్షింపఁగలిగెను. తోడనే పెద్ద నిట్టూర్పు విడిచి పక్కపై వ్రాలి మైమఱచి నిదుర వోయెను. మఱునాఁ డుదయముననే యాతఁడు మేల్కొని తన కుపచారము లొనరించుదాదిని గన్నులారఁ గాంచెను. తోడనే యాతనికనుగొలఁకులనుండి యశ్రుబిందువులు రాలెను. హృదయము దుఃఖపూరిత మయ్యెను. శరీరము వడవడ వడఁకఁ దొడఁగెను.

“ నాయనా ! నాయనా ! ఏల నట్లు దుఃఖించెదవు ? ఈశ్వరునిదయవలన నీ కిప్పుడు స్వస్థత కలుగుచున్నది. నీ విప్పు డేడ్చినచో నీకన్ను లిఁకఁ బనికిరాకుండఁబోఁగలవు. నీశరీరమును గంపింపఁ జేసినచోఁ దిరిగి జ్వరము రాఁగలదు. తండ్రీ ! నీ కిప్పు డేమిబాధ కలిగినది ? నే నెట్టిలోపమైన నీయెడలఁ గావింప లేదుగదా ? దాఁపక నాతో యథార్థముఁ జెప్పుము.” అని యామె యాతని గడ్డముఁ బట్టుకొని బ్రతిమాలినది. ఆతఁ డామెవంకఁజూచి దుఃఖ మాఁపుకొనలేకుండెను. దాది యాతని యారోగ్యము తిరిగి చెడిపోవునేమోయని యత్యంతవిచార మొందుచు “ నాయనా ! నీవు దుఃఖ మాఁపుకొని యథార్థముఁ జెప్పకున్న నాతోడే, నన్నుఁ జంపుకొనితినినట్లే,” యని యొట్టుఁ బెట్టెను.

పాప మాబాలుఁడు విధిలేక దుఃఖ మాఁపుకొన్నాఁడు. నోరు సవరించుకొన్నాఁడు. ఎండిపోయినపెదవుల నాలుకతోఁ

దడుపుకొన్నాఁడు. మెల్లగా ,, అమ్మా! నీముఖమునఁ బెద్ద మచ్చయున్నదేమి?" అని యడిగి కంటనీర్వెట్టుకొన్నాఁడు. 'దెబ్బతగిలిన' దని యామె మెల్లగ సమాధానముఁ జెప్పెను. 'ఎవ్వఁ డెప్పుడు? ఎట్లుతగిలిన' దని మఱల నాతఁడేడ్చుచు నడిగెను.

"ఎట్లుతగిలినదో నాకుఁ దెలియదు. నే నొకదినమున బండిపై నెక్కి రాజ మార్గమునఁ బోవు చుండ నొక్కెడ నాకస్మికముగ నొక ఱాయి వచ్చి నా నుదుటిపైఁ దగిలినది. నే నెంతయు బాధనొంది వెంటనే కట్టుఁ గట్టు కొంటిని. గాయము చాలదినములవఱకు మానలేదు" అని యామె మఱల వచించెను.

ఈమాటలువినినతోడనే యాబాలుఁడు కెవ్వుమని కేక వైచినాఁడు. ఆతనిశరీర మంతటను జెమటలు పట్టినవి. "అమ్మా! బాల్యచాపల్యమున నాఁడు నిన్ను గొట్టిన దురాత్ముఁడను నేనే, నా కీశ్వరుఁడు విధించిన యాశిక్షచాలదు. దయామయవగు నిన్ను నిష్కారణముగఁ గొట్టి నొప్పించిన యాదుష్టుని, తల్లిదండ్రులచేఁ గూడ బహిష్కరింపఁబడిన యానిర్భాగ్యుని నీవు భగవంతునివలె రక్షించి బ్రదికించినావు. ఇట్టి పాపాత్ముఁడు నీచే సపర్య లొందుట కర్హుఁడుగాఁడు. తల్లీ! భరింపలేను. నీవు నన్నిక నిట్లు బ్రదికింప నెంచకుము. బ్రదికి నిన్ను బాధించినవిషయము మఱువలేను. జననీ! నీకరు

ణయే, నీదయయే, నన్నాపాదమస్తకము దహించుచున్నది." అని యాతఁడు వెక్కి వెక్కి యేడువసాగెను. దాది కరుణార్ద్రచిత్తయై, యాతనిశరీర మంతయు నిమిరినది. ఆతని నోదార్చుట కెన్నియో ప్రయత్నములు చేసినది.

ఎఱుఁగక విలాసమున కొనరించినపని తప్పని గ్రహించి యాతఁడు పశ్చాత్తాపము నొందినాఁడు. పశ్చాత్తాపమున నాతని పాపము సర్వము మండిపోయినది. ప్రక్షాళితమనస్కుఁడై యాబాలుఁడు పరిశుద్ధి నొందినాఁడు.

# పాపిని—జీసస్.

౧

పరమేశ్వరుని పాపావనదీక్షయు, దీనదయాపరత్వము, భక్తరక్షణతత్పరత, మొదలగుసద్గుణములు చాలవఱకు 'జీసస్' నందును గలవు. ఎందఱినో పాపుల నాతఁడు రక్షించినాఁడు.

ఒకదినమున 'జీసస్' ఆలివ్పుమెట్టపై కెక్కినాఁడు. ఉదయమగుసరి కచ్చటి దేవాలయముచెంతకుఁ బోయినాఁడు. అతనినిఁ జూచి జను లంద ఱాతనిచుట్టును మూఁగినారు. 'జీస' సచ్చట సుఖాసీనుఁ డయినాఁడు. ప్రజలందఱు సావధాను లైరి. అతఁ డాజనుల కేవేవో హితోపదేశములఁ గావించినాఁడు. వారంద ఱాతని బోధామృతాస్వాదనమున శరీరములు మఱచి యుండిరి. అంతటను నిశ్శబ్దముగ నుండెను. 'జీసస్' మాటలు మాత్రము దివ్యసంగీతమువలె శ్రోతల నాకర్షించినవి.

అంతట నకస్మాత్తుగ నాలయమునకు దూరమున నేదో పెద్ద కలకలము వినవచ్చినది. "కొట్టుఁడు, ఈడ్వుఁడు" అను పెద్దపెద్ద కేకలు వినఁబడినవి. ఒకవైపునుండి పెద్దజనసమూహము వారివైపునకుఁ గదలివచ్చుచుండెను. ఎందఱో ఫారిసీలును, బండితులు నందుండిరి. ఆగుంపునకు నడుమ నొక యువతి యుండెను. ఆమెతలముడి వీడి యుండెను. జాఱిపోయెడి తన వస్త్రము

నప్పుడప్పు డామె సవరించుకొనుచుండెను. ఆమె కన్నుల నుండి రాలిన యశ్రువులు కనుగొలఁకులనుండి చాటికలుగా నెండిపోయెను. గాఢలజ్జాభరమున నామె వదనము వంచి నడచుచుండెను. "అయ్యో ! నేనేల నిట్టినీచపుఁబని నొనర్చి వీరిచేఁ బట్టువడితి ?" నని యామె తనతప్పున కెంతయు వగచుచుండెను. ఆమె మొగమునుండియుఁ జెక్కులనుండియు రక్తధారలు ప్రవహించుచుండెను. ఆమెవస్త్రములు రక్తప్లావితములై యుండెను. ఆమెదీనవదనముఁ గాంచినవారల కెల్ల మిక్కిలి జాలి గలుగుచుండెను.

దిక్కుమాలినయీవనితను వా రట్లేల లాఁగికొని వచ్చుచున్నారో యనునూహ మహాత్ముఁడగు 'జీసస్' హృదయాకాశమున మెఱసినది. మహాత్ముఁడు గ్రహించినవానివలెఁ దల యూఁపినాఁడు. ఆమెమొగమున నిష్కల్మషభావ మాతనికి గోచరించినది.

౨

అగుంపులోనివారందఱిచేతులలోను గర్కశములగు ఱాళ్లున్నవి. వానితోఁ గొట్టి చంపెద మని వా రనుక్షణ మామెను బెదరించుచుండిరి. ఆమె పాపమొనరించినదఁట. ఆమెపాపాత్మురాలని నిర్ధారణఁ గావించుటకెన్నో నిదర్శనములను వారు సంపాదించిరి. ఇట్టి పాపకృత్య మొనరించినయీయామెకు 'జీసస్'

ఎట్టిశిక్ష విధించునో తెలిసికొని యాతనియెదుటనే వా రామెను ఱాలురువ్వి చంపఁ దలఁచిరి. 'జీసస్' తో వా రంద ఱొక్క-పెట్టున ని ట్లనిరి.

“అయ్యా ! ఈనీచురాలు మిక్కిలిపాపమొనరించినది. ఈపాపాత్మురాలికి మీరు తగిన శిక్ష విధింపఁ గలరని మీయొద్దకుఁ గొనివచ్చినారము. మోసెస్న్యాయశాస్త్రమునం దెట్లాజ్ఞాపింపఁబడియున్నదో తెలియునా ? ఇట్టి పాపాత్మురాలిని ఱాలురువ్వి చంపుట కధికార మీయఁ బడియున్నది. దీనికి నీ వేమందు” వని వా రాతని నడిగిరి.

ఆతఁ డాస్త్రీకిఁ దగిన శిక్షవిధింపకున్నచో నెట్టులైన వా రాతనిపై నేరమునుస్థాపించి యాతని మతప్రవక్తృత్వమును గాదనఁ దలఁచిరి. కాని యంతలో జీసస్మహానుభావుఁడు కనులను మూసికొనినాఁడు. చేతుల జోడించి నేలపై మోఁక ఱిల్లినాడు. వారిమాటలను విననివానివలె నేమేమో తన వ్రేలితో నేలపై వ్రాసికొన్నాఁడు. “ఏమిచెప్పుదు” వని యాతనిఁ దిరిగితిరిగి వా రడుగుచునే యుండిరి. కాని తమ పాపములనే యాతఁడు నేలపై వ్రాయుచున్నాఁడని వారలు గ్రహింపఁ జాలరైరి. జీసస్ మెల్లగా లేచి కన్నులఁ దెఱచి నల్వంకలను గాంచెను. “నాయనలారా ! మీలో నెవ్వఁడైన నొక్క-పాపమైన నాచరింపని వాఁడున్నచో నాతఁడే మొదట నీమెపై ఱాయి విసరవలయును” అని గంభీరముగఁ బలికెను.

తిరిగి జీసస్ మోకాళ్లపైఁ గ్రుంగినాఁడు. కన్నులు మూసినాఁడు. వ్రేలితో నేమేమో నేలపై వ్రాయుట కారంభించినాఁడు. వారు జీసస్‌మాటలను విన్నారు. ఎవరిహృదయములనువారు పరీక్షింప సాగినారు. గుండెపైఁ జేయి వైచుకొని "నాచరిత్రము నిష్కళంక మైన" దని యొక్కఁడును బలుకలేకపోయెను.

ఎవరిమట్టుకు వా రేదేనిఁ బాపమొనరించినవారే. ప్రమాదమునఁగాని, బుద్ధిపూర్వకమునఁగాని, యేచిన్న పాపమును జేయనివాఁ డుండఁడు. కాని పశ్చాత్తాపము పాపనిర్మూలనముఁ గావింపఁ గల దనుట నిర్వివాదాంశము. అందలి పండితు లందఱుఁ బాపము లాచరించియుఁ దమఖ్యాతి కెక్కడఁ గళంక మాపాదిల్లునో యనియెంచి యెవ్వరును దమతప్పు నొప్పుకొనరైరి. ఒక్కొక్కరే క్రమముగ గుంపును వీడి బైటికి వెడలిపోయిరి. వారికి మాత్ర మంతరాత్మలు లేవా? మీరుఁ గూడఁ గొంత పాప మొనరించినారని వారి కవి చెప్పినవి. వారియంతరాత్మలకు వ్యతిరేకముగ నడచినచో వారలు మఱింత నేరముఁ గావించినవా రగుదురు.

జీసస్‌మాటలందఱితలలకు నెక్కినవి. అందఱు నచ్చటి నుండి వెడలిపోయిరి. జీసస్‌మాత్ర మచ్చట మిగిలెను. అతఁ డటులనే వంగియుండెను. ఆమె యట్లే యాతనియెదుటనే నిలువఁబడి యుండెను. జీసస్ మెల్లగ లేచి కన్నులఁ దెఱచెను. ఆమెతప్ప నచ్చట మఱియెవ్వరును లేరు. అతఁ డామెవైపు

నకుఁ దిరిగి "అమ్మా! నీయందు నేర మారోపించినవార లంద ఱేమయిపోయిరి? వారిలో నొక్కఁడును నిన్ను నిందింపఁ జాలకపోయెనా?" యని యడిగెను.

"దేవా! నన్నెవ్వరు నేమియుఁ జేయలేదు. నీవుఁ గూడ నట్లను గ్రహించెదవుగాక" యని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

"నేనుమాత్ర మెందులకు నిందింతును. నీవు పశ్చాత్తాప మొందితివి. కావున నీపాపము లెల్లను నశించినవి పొమ్ము. నీదారిని నీవు వెడలిపొమ్ము. ఇఁక నెన్నఁడుఁ బాప మొనరింపకు" మని చెప్పి యాతఁ డామె నతిదయార్ద్రహృదయముతో నోదార్చెను. తలను పైకెత్తి యామె జీసస్ దయాప్రసన్న వదనమును వీక్షించి కన్నీటధారలఁ గురిసినది. హృదయాకాశమున నావరించియున్న పాపపుమేఘము వర్షించి యంతటను నిర్మలముగఁ జేసెను. ఈశ్వరుఁ డామె కెంతమృదుల ముగ నీపాఠమును నేర్పెనో?

ఆమెయొనరించిన దుష్కృత్యము లొక్కటొక్కటిగ నామెకు జ్ఞప్తికి వచ్చినవి. ఆమహాత్ముని వాగమృత మామెను నిష్కల్మషురాలినిఁ గావించినది. చేసినపాపము లెల్లఁ గన్నీరుగా నామె వెలికిఁ గ్రక్కివైచినది. హృదయముతోపాటు దేహము పరిశుద్ధత నొందినది. పశ్చాత్తాపమునఁ బాపనాశన మైనది. పాపి పావనాత్మ యైనది.

# అహింసకుఁడు—బుద్ధుఁడు.

౧

ప్రసేనజిత్తుఁడు కోసలరాజ్యప్రభుఁడు. వేదవేదాంగవిదుఁడగు భార్గవుఁ డాతనిపురోహితుఁడు. కొంతకాలమునకీ భార్గవున కొక పుత్త్రుఁ డుద్భవిల్లెను. తల్లిదండ్రులు మహానందమున మేనులు మఱచిపోయినారు. ఈశుభవార్త మహారాజునకుఁ దెలిసినది. ఆసద్బ్రాహ్మణునకుఁ దనయానందమును దెలియఁబఱచినాఁడు. 'అహింసకుఁ' డని యాబాలునకుఁ బేరు వెట్టిరి.

భార్గవుఁడు జ్యోతిశ్శాస్త్రపారంగతుల రావించి తన కుమారునిజన్మనక్షత్త్రాదులను వారికిఁ దెలియఁబఱచి జాతకమును వ్రాయఁ గోరినాఁడు. పండితు లందఱుఁ బిల్లవాని తారాబలముఁ బరీక్షించినారు. వారిమొగములు వెలవెలబోయినవి. హృదయములలోనియానందమంతయు మాయ మయ్యెను. 'అహింసకుఁడు' పరమహింసకుఁడును, దుర్మార్గుఁడునై, లోకులఁ దల్లడపఱచి యనేకప్రాణములఁ దీయునని చెప్పినారు.

భార్గవున కీమాటలు శూలములై పోయినవి. ఏమిచేయుటకును నాతనికిఁ దోఁచినదికాదు. తనకుమారునివలనఁ బ్రజల కెట్టి కష్టము వాటిల్లినను, దాను సహింపలేఁడు. లేక లేక కలిగినవాఁడగుటచేఁ దనయునిఁ బొలియింపలేఁడు. మిక్కిలి

దీర్ఘాలోచనఁ జేసినాఁడు. కొమరునివలన నెందఱో విగతజీవు లై పోవుటకంటెఁ గొమరుఁడే చనిపోవుట మే లని తలఁచినాఁడు. అహింసకు నప్పుడే చంపుటకు నిశ్చయపఱచుకొన్నాఁడు. మహారాజీవిషయమును గ్రహించినాఁడు. వెంటనే పురోహితునిఁ గలిసికొని యతనియభిప్రాయము చెడ్డ దనియు, సుతుఁ డెంతటిదుర్మార్గుఁ డైనను గన్నతల్లిదండ్రులే తమకొమరుని జంపుకొనుట విపరీతముగ నుండు ననియు, దుర్వ్యాపారములలోఁ జొరబడకుండ జాగ్రత్తగఁ గాపాడుకొన్నచో నహింసకుఁ డెన్నటికి దుర్మార్గుఁడు కాఁజాలఁ డనియు ననేకవిధముల బోధించి భార్గవునిసంకల్పము ను వారించినాఁడు.

అహింసకుఁడు క్రమముగఁ బెద్దవాఁ డయ్యెను. జననీ జనకులయాజ్ఞ లెన్నఁడును జవదాఁటలేదు. గురువులు గీచిన గీటు దాఁట లేదు. అధ్యాపించినవిషయము లందఱిబాలురకన్న నెక్కుడు శ్రద్ధతో నభ్యసించుచుండెను.

భార్గవుఁ డహింసకుని సకలవిద్యాపారంగతునిఁ గావింపఁ దలఁచినాఁడు. పురాతననగరములలో విద్యాపీఠమని వన్నె కెక్కిన తక్షశిల కాతనిఁ బంపించి యచట విద్యఁ గఱపింపఁ దలఁచి తగుప్రయత్నములు గావించెను. అప్పటి యహింసకుని సత్ప్రవర్తనము చిన్నప్పుడు జ్యోతిష్కులు చెప్పిన మాటలను మఱపించినది.

అహింసకుఁడు తక్షశిలానగరమున కేఁగి యచ్చటి విద్యాశాల లన్నిటిలోను మిన్నయగుదానియందుఁ బ్రవేశించి

నాఁడు. ఆతని ముఖవర్చస్సు, చురుకుదనము, తెలివితేటలు, గురువుల నాకర్షించినవి. ఆతఁడు దినదినము విద్యలయందుఁ బ్రవీణతను సంపాదించుచుండెను. ఉపాధ్యాయు లేది చెప్పిన నదియెల్ల వెంటనే గ్రహించి మనసున కెక్కించుకొనుచుండెను. గ్రహణశక్తియందు, వాక్ప్రౌఢిమయందు నీతఁడు తక్కిన విద్యార్థుల నందఱిని మించియుండుటచే నీతనిపై గురువుల కెక్కుడు ప్రేమ ముదయించెను.

౨

అహింసకుఁడు తెలివితేటలు గలవాఁడును, జ్ఞానవంతుఁడు నయినప్పటికిఁ గొంచెము కొంటెతనముఁ గలవాఁ డగుటచేఁ దోడిబాలుర కాతఁడన్న నసహనము పైలుదేఱినది. ఆతఁడు వారిలోఁ గొందఱఁ గొట్టియుఁ గొందఱఁ దిట్టియు మిక్కిలి బాధించెను. అతనిచేష్టలకుఁ దక్కినబాలు రెల్లఱు మిక్కిలి కినియుచుండిరి. బాలు రెల్లఱుఁ బట్టఁ జాలనికోపమున గురువులచెంతకుఁ బోయి యహింసకునిపై నెల్లప్పు డేవో యుపచారముల నున్నవికొన్నియు, లేనివికొన్నియుఁ గల్పించి చెప్పుచుండిరి. గురువు లాతనియందలి సదభిప్రాయముచే నాతని నెక్కువగఁ జీవాట్లు పెట్టరైరి. దినములు కడచినకొలఁది నహింసకునిదుండగములు మీఱిపోయినవి. సహాధ్యాయు లెంతయు విసిఁగిపోయిరి. అధ్యాపకులును సహింపలేకపోయిరి.

ఉపాధ్యాయు లొకదినమున నహింసకునిఁ దమచెంతకుఁ బిలిచి "ఏమోయీ ! నీయాగడము మితిమీఱి పోవుచున్నది. నీ విఁకముం దెట్టిదుష్టచేష్ట లొనరించినను, కఠినముగ శిక్షింపక మాన" మని చెప్పిరి. కాని వారిమాటలపై నాతఁ డిసుమంతయు లక్ష్య ముంచలేదు. ఎప్పటిమార్గముననే సంచరించుచుండెను. గురువు లీతని దుష్ప్రవర్తనము నెటులైన మాన్పింపవలయునని యనేక ప్రయత్నములఁ గావించిరి. కాని ఫలితమేమియు లేకపోవుటచే వా రాతని కొక యసాధ్యమైనకార్యము నియోగింప నెంచిరి. అట్టి యమానుషకార్యము నొనరించుటకు వెఱచి యాతఁ డిఁకముం దెట్టిదుర్ణయములను గావింపనని వేఁడుకొని సన్మార్గమునఁ జరింపఁ గలఁడని వారు తలఁచిరి.

"అహింసకా ! నీవీవిద్యాలయమున నుండుటకు యోగ్యుఁడవు కావు. నీమూలమునఁ దక్కినబాలు రెల్లఱును జెడిపోవుచున్నారు. వారు నీవలన నెన్నో కష్టములకుఁ గూడఁ బాలగుచున్నారు. కావున నీవీక్షణముందే యీప్రదేశమును విడిచిపోవలయును. నీకంతగ విద్యాభిలాష కలదేని, నీ వీ విద్యాలయమందే విద్య నేర్చుకొనఁ దలఁచితివేని మేము నీ కొక కార్యము నియోగింతుము. జంకక నీ వద్దానిని నెఱవేర్పవలయును. నీకది యిష్టమేనా" యని యడిగిరి. "మీరు విధించినదెట్టికార్యమైనఁ దప్పక నొనరింపఁ గలవాఁడ" నని యహింసకుఁడు బదులు జెప్పెను. "నీవు వేయిమందిమనుష్యు

లను జంపి వారలకుడి చేతిబొటన వ్రేళ్లను గుఱుతుగాఁ దెచ్చి మాకుఁ జూపవలయును. అట్లయినచో మఱల నిన్నిందుఁ జేర్చి కొనఁగల” మని వారు వచించిరి.

గురువు లాతనిముఖలక్షణములను బాగుగఁ బరిశీలింపఁ దొడఁగిరి. ఆతనిలో నేదైన మార్పుందునని వారి యభిప్రాయము. అహింసకుఁడు వారిమాటల నన్నింటినివిన్నాఁడు. గురువులనుకొనిన ట్లాతఁడించుకయుఁ బశ్చాత్తాప మొందియుండలేదు. ‘ మీయాజ్ఞా ప్రకారము నేను వేయిమందిని జంపి వారి యంగుళులను దెచ్చి యిచ్చెద ’ నని యాతఁడు వచించి తత్క్షణమే యటనుండి వెడలిపోయెను.

3

అరణ్యమార్గమునఁబోవు బాటసారుల కెన్నఁడునులేని యిక్కట్టులు నేఁడు తటస్థించినవి. ఆమహారణ్యమున ననిమిది బాట లొక్కచోటఁ గలిసియున్నవి. ఎవ రేయేబాటవెంట వచ్చినను నీస్థలమునకు రాకతీరదు. ఇచ్చట నొక యువకుఁ డొకభయంకరమైనకరవాలమునుఁ జేతఁ గైకొని మార్గమునఁ బోవు బాటసారుల నెందఱినో నిరంతరముఁ జంపుచుండెను. ఆడువారనిగాని, పసివారనిగాని, ముదుసలులనిగాని యెంత మాత్రము వివక్షతలేక మహాక్రూరత్వమున నాతఁ డెందఱినో యవలీలగ నఱికి చంపినాఁడు. ఆయడవియంతయు రక్తమయ

మైపోయెను. చుట్టుపట్లనున్న గ్రామములలోని ప్రజ లెల్లరు భయకంపితు లైరి. ఈవార్త దేశమం దంతటను వ్యాపించెను.

భార్గవున కీవృత్తాంత మంతయుఁ దెలిసెను. కుమారుఁ డొక్కమా రాతని మనసులోఁ బొడసూపినాఁడు. నరహంత యహింసకుఁడే యయియుండునా ? యనియాతఁ డూహించెను. తప్పక యాతఁడే యయియుండునని నిశ్చయపఱచుకొనెను. మహారాజగు ప్రసేనజిత్తుఁడుఁ గూడ నీవృత్తాంత మంతయుఁ దెలిసికొని కొంత యలజడి నొందినాఁడు. తనరాజ్యమున నట్టి క్రూరకృత్యములు జరుగుచున్నందులకై మిక్కిలి సిగ్గువడినాఁడు. ఆదుర్మార్గు నెట్లులైనఁ బట్టుకొని ప్రజల నుద్ధరించుట కాతఁడు కంకణముఁ గట్టుకొన్నాఁడు.

భార్గవుఁడు రాజుచెంత కరుదెంచి ' మహారాజా! ప్రజాహంత నాకొడుకేయని తోఁచుచున్నది. వీఁ డిట్టివాఁడగుననియే నేను చిన్నతనమందే వీనినిఁ జంప నెంచితిని. మీరు దూర మాలోచింపక నన్ను వారించితిరి. గోటిచేఁగాఁదగుపని గొడ్డలిచేఁ జేయవలసివచ్చినది. కొఱవిచేఁ దలగోకకొనినట్లయినది. వీనివలన, నెందఱో ప్రజలు కడతేఱుచున్నారు. ఈదుష్టు నెట్టులైన వెంటనే పట్టించి ప్రాణములఁ దీయించుట యుత్తమ ' మని పలికెను.

పాప మహింసకునితల్లి శోకాకులిత యైనది. కొడుకెట్టి క్రూరకర్ముఁడైనను దల్లి వానినిఁ జంపుటకు సహించునా ?

ఆమెవిచారమునకు మేరలేకుండెను. వెంటనే రాజు పరివార యుతముగ నహింసకునిఁ బట్టుకొనుటకై బెలుదేఱెను.

నరాంతకుఁడైన యా బ్రాహ్మణకుమారునకు దయాదాక్షిణ్యములు నశించినవి. దారుణకృపాణముచే నందఱితలలనో నఱికినాఁడు. వారియందఱియంగుళులను నొకమాలగా గ్రుచ్చినాఁడు. త్వరలోనే వేయియంగుళులను బూర్తిఁజేసి గురువుల యాజ్ఞఁ జెల్లింపఁ దలఁచినాఁడు. ఇప్పటికేఁ దొమ్మిదివందల తొంబదితొమ్మిదియంగుళులు సమకూర్పఁబడినవి. మఱియొక యంగుళితో మాల పూర్తి యగును. ఇప్పు డాతనికి మఱింత యాత్రము జనించినది. ఇఁక నొక్క మనుజుఁ డావైపున కరుదెంచినచో నాతని శ్రమము ఫలించును. ఆయొక్కయంగుళికై యాతఁ డొక్కనిముసమాలస్యమునకైన సహింపలేకుండెను. అట్టితఱి మహారాజైదుర్రైనఁ జంపితీరును. తుదకుఁ దల్లినైనఁ దండ్రినైనఁ జంపుటకు సందేహింపఁడు. ఆతనికి క్షణమొకయుగముగఁ దోఁచుచుండెను. తుద కాయొక్కయంగుళి లభింపదేమోయను సంశయము గలిగెను.

౪

జేతవనము మహాశాంతియుతమైనది. ప్రతివృక్షము నుండియుఁ గరుణరస మొలుకుచుండును. నిర్భయముగా నెన్నో జంతువులు సంచరించుచున్నవి. ఎన్నో పక్షులు పాటలు

పాడుచున్నవి. మహానుభావుడగు బుద్ధభగవానుఁడా జేతవనములో, బోధివృక్షము క్రిందఁ గూరుచుండి తపస్సు చేసికొనుచున్నాఁడు. పరమదయాస్వరూపుఁడగు నాగౌతమబుద్ధుఁడు నరహంతవృత్తాంత మంతయుఁ దెలిసికొన్నాఁడు. వాని నెటులైన సన్మార్గమునఁ బెట్టఁదలఁచి యాతఁడు సంచరించునరణ్యమున కేతెంచినాఁడు.

అహింసకుఁడు రక్తారుణితములై, భయంకరములైన తన నేత్రములఁ దెఱచుకొని, నిశితకరవాలమును జేతఁ బూని యెవ్వ రెదురౌదురాయని దిక్కులఁ బరికించుచుండెను. అంతలో బుద్ధసన్న్యాసి తనవైపునకే వచ్చుచుండెను. నరహంత యాబుద్ధసన్న్యాసిని దూరముననే కాంచి తనసంకల్ప మిప్పటికి నెఱవేఱినదని తలఁచినాఁడు. హృదయమున నమితోత్సాహ మొందినాఁడు. తత్క్షణమే వానిని జంపనెంచి ముందునకుఁ బరుగెత్తినాఁడు. ఈతఁడు కొంతదూరముననుండగనే యాసన్న్యాసి వెనుకకు మఱలెను. కాలుకొలఁదిఁ బరుగెత్త నారంభించెను. అహింసకుఁ డాతనివెంటనంటి పరుగెత్తినాఁడు. ఎంతపరుగిడినను నతఁ డాసన్న్యాసిని గలిసికొనలేకపోయినాఁడు. ఎంతోబల మువయోగించి యాతనిని మించిపోవఁ బ్రయత్నించినాఁడు. కాని సన్న్యాసి యంతకంటె వేగముగఁ బరుగెత్త సాగెను. అహింసకుని శరీరములోనిశక్తి తగ్గిపోయినది. పిక్కలలోనిబల ముడిగిపోయినది. మనసులోనిధైర్యము జాఱిపోయినది. భరింప

రాని యాయాసముతో నిట్లు సన్న్యాసికి వినఁబడునట్లు కేకవేసి చెప్పెను.

"ఓయీ! దయయుంచి యక్కడనే నిలువుము. నే నిఁక నిన్నుఁ బట్టుకొనలేను" సన్న్యాసి "ముందుగ నీ వచ్చట నిలిచినచో నేనును నిచ్చట నిలువఁ గల" నని సమాధానముఁ జెప్పెను. అహింసకుఁ డాఁగెను. తనదుర్బలత్వ మున కెంతో యాశ్చర్యపడెను. సన్న్యాసి నిలువఁబడి వెను కకుఁ దిరిగిచూచెను. దీర్ఘనిశ్వాసములు పుచ్చుచు భూమిపై నిలుచుటకుఁగూడ బలములేనికాళ్లతోఁ దూలిపోవుచుండెడి యహింసకునికిఁ దన దివ్యమూర్తిని బ్రదర్శించెను.

అహింసకుఁడు ప్రశాంతగంభీరమూర్తియైన యాబుద్ధ దేవునిదివ్యరూపమును దర్శించి మోఁకరిల్లి ప్రణామముఁ గావిం చెను. బుద్ధభగవానుఁ డాయహింసకునకు నమృతోపమానము లగు వాక్కులతో దయాసిద్ధాంతము, నహింసాసిద్ధాంతము నుపదేశించెను. ఆదయామయునికన్నులనుండి కరుణరస మొలికి పోయెను. వాక్కులలో నతిమధురమగు దయారసము స్రవిం చెను. ఆగంభీరోపదేశమున కహింసకుఁడు మంత్రముగ్ధునివలె నచేతనుఁ డై పోయినాఁడు. ధర్మమునుగూర్చిన యమృతమయ వాణి బుద్ధునిముఖమునుండి వెలువడఁగనే విస్మయస్తబ్ధుఁ డై నాఁడు.

అహింసకునిహృదయము తొలుత వజ్రాతికఠినము. ఇప్పు డది నీరైనది. కన్నులనుండి యశ్రువర్షము కురిసినది. పశ్చా

త్తాపముచే శరీరము భస్మమైనది. పునర్జన్మము నొందినాఁడు. తత్క్షణమే యాతఁడు బుద్ధభగవానునిపాదములపైఁబడి

"బుద్ధంశరణంగచ్ఛామి,
సంఘంశరణంగచ్ఛామి,
ధర్మంశరణంగచ్ఛామి"

అని త్రిశరణముల నొందినాఁడు. గౌతమబుద్ధుఁ డతని లేవనెత్తినాఁడు. కౌఁగిటఁజేర్చుకొనినాఁడు. తనతో జేతవనమున కాతనిఁ దీసికొనిపోయినాఁడు. పరమక్రూరుఁడైన నరహంత యిప్పుడు పరమసాధుభిక్షుకుఁ డైనాఁడు. బుద్ధాశ్రమమునందలి భిక్షుకులలో నహింసకుఁ డన్నివిధముల ఘనత వహించినాఁడు. ఆశ్రమనిర్వహణములో బుద్ధభగవానున కన్నివిధములఁ దోడ్పడినాఁడు.

ప్రసేనజిత్తుమహారాజహింసకునికొఱకై యనేకఘోరారణ్యములఁ దిరిగితిరిగి యెచ్చటను గానక మిక్కిలి వేసారి తుదకు జేతవనముఁ బ్రవేశించినాఁడు. బుద్ధదేవుని దర్శించినాఁడు. తన యాగమనకారణ మాతనికి విన్నవించినాఁడు. అహింసకుఁడు చేఁజిక్కినచో నాతనికి గొప్ప శిక్ష విధించి లోకము నుద్ధరించెదనని పలికినాఁడు. బుద్ధుఁ డామాటలన్నియు విని "రాజా! సాధుశ్రేష్ఠున కెట్లు శిక్షవిధింతు" వని యడిగెను. రా జందుల కాశ్చర్యపడెను. పిమ్మట బుద్ధుని యాజ్ఞపై నటకొక భిక్షునన్యాసి యరుదెంచెను. రా జాతని

గుర్తించెను. అతఁడే యహింసకుఁడని గ్రహించెను. మహా దానందమునఁ దనమెడలోని ముక్తాహారమును నాతనికంఠమున నలంకరించెను. కాని సర్వసంగపరిత్యాగియగు నహింసకున కా ముక్తాహారముతోఁ బనియేమి?

పాపాసక్తుఁడును, దురాచారుఁడు నగు మహాహంత పశ్చాత్తాపమునఁ బుణ్యవంతుఁడై నాఁడు. అతని శరీరము పవిత్రమైనది. జీవనము ధన్యమైనది.

# వాల్మీకి—బాలిక.

౧

హిమవత్పర్వత ప్రాంతమున నొక యరణ్యము కలదు. ఆకసమంటెడియెత్తైనవృక్షము లచ్చటఁ గ్రిక్కిఱిసియున్నవి. ఎన్నో యడవిమృగము లచ్చట నిర్భయముగ సంచరించు చున్నవి. ఫలభరితములగువృక్షశాఖలపైఁ బక్షులు కలకలఁ గూయుచున్నవి. ఒరులకుఁ జొరశక్యముకాని నిర్మానుష్య మగు న మ్మహారణ్యమునఁ గొందఱు చోరులు ప్రవేశించిరి. క్రూరులగు నాచోరు లాయరణ్యమును జీకాకు పఱచిరి. వా రందలి మృగములను బక్షులను జంపి తినుచుండిరి. వృక్షముల నన్నిటిని నాశనముఁ జేసిరి. సమీపమునయున్న పల్లెలను బట్టణ ములను గొల్లగొట్టి సొమ్ముల నాయరణ్యమునకుఁ గొంపోవు చుండిరి.

బాటసారులనుబట్టి బంధించి పలువిధముల బాధఁబెట్టు చుండిరి. ఎందఱిస్త్రీలనో చెఱఁబట్టిరి. వారియిష్టదేవతయగు కాళికాదేవి కెందఱోపురుషులు, నెందఱోస్త్రీలు బలి యీయఁ బడిరి. చెడఁద్రావి వారొనర్చెడి ఘాతుకకృత్యము లతిభయం కరములుగ నుండెను. అత్యంతశోభామయమై కన్నుల కానం దముఁ గొల్పెడి నాయరణ్య మంతయు నాదొంగలగుంపు

కాలిడినకొలఁది దినములలోనే శూన్యమై శ్మశానవాటికయై పోయినది. రక్తముచేఁ దడిసి నేలయంతయు నెఱ్ఱనై పోయినది.

ఒకనాఁటిసాయంకాలమున నాదొంగ లందఱు నడవిలో నొకమూలనుండి కాళికాలయమువైపున కరుదెంచుచుండిరి. ఆగుంపులోనికోలాహలమున కరణ్యమందలి ప్రాణికోటి యంతయు గడగడ లాఁడినది. ఆనందముగ గ్రేళ్లుఱుకు లేళ్లు మొదలగుజంతువులు మూలమూలల దాఁగుకొనినవి. మనోహరముగ గానమొనరించుపక్షులు గూండ్లలో నక్కినవి. వారల యార్భాటములకు మన్నుమిన్ను గూడ నదరినది. ఎవరినోటికి వచ్చినట్లు వారు వదరఁ జొచ్చిరి. మూటలలోనిధనమును పైకెగురవైచుచు "నింతధనము దొరకునని యనుకొనలే" దని యొక్కఁడును, "స్త్రీలని, పసిపాపలని, నఱకుటకు సందేహించినచోఁ గార్యమెట్లగు" నని యింకొకఁడును, "నీధనమంతయు నేనే నాయకునకు సమర్పింతు" నని మఱియొకఁడును జెప్పుకొనుచుఁ గేక లిడుచు, నాడుచుఁ బాడుచు, నాలయమును సమీపించిరి.

దొంగలనాయకుఁ డాలయద్వారముకడ నిలువఁబడి యున్నాఁడు. అతఁడు బలిసిన నల్లని శరీరము నాజానుబాహువులఁ జింతనిప్పులవంటినేత్రములఁ గలిగి హస్తమునఁ గత్తియు భుజమున బాణతూణీరములను ధరించియుండెను. అతని జూచినతోడనే పచ్చిమాంసముఁదిని రక్తముఁద్రావు క్రూరరాక్షసాకారము జ్ఞప్తికివచ్చును.

దొంగలంద ఱాతనికి జోహారులు చేసిరి. దోఁచుకొని తెచ్చిన ధన మంతయు నాతనిపాదములచెంతఁ బోసిరి. నాయకుఁ డదిచూచి వా రొనరించినఘనకార్యమున కెంతయు సంతసించినవానివలెఁ దల యూఁపినాఁడు. "నేఁ డమావాస్య. నేఁటి రాత్రి కాళికకు గొప్పబలి నీయవలెను. మహాకాళిని జూచితిరా? రక్తముకొఱకై నో రెట్లు తెఱచుకొనియున్నదో! కన్నులె ట్లెఱ్ఱఁజేసి నిప్పులఁ గ్రక్కుచున్నదో! మీసామర్థ్యమును నేఁడు నేను కనుఁగొనెదను. ఆదేవికోప ముపశమింపఁజేయుట కెట్టిబలి యుక్తమో మీకే తెలియును. ఆమెభయంకరరూపముఁ త్వరగఁ జల్లఁబడఁ జేయవలెను. ఆమెయాగ్రహము శమింపఁ జేయవలెను. ఇదిగో! నాచేతిలోనికృపాణము. ఆదేవిని దృష్టిపఱచుట కెప్పుడును రక్తపుటేరులఁ బ్రవహింపఁ జేయుదునని చెప్పుచున్నటు లెట్లుతళతళలాడుచున్నదో? చూచితిరా!" యని వారిని హెచ్చరించెను.

కాళికాదేవిసంప్రీతికొఱ కెట్టికార్య మొనరించుటకైనను వారు వెనుదీయరు. "ఏలిక చెప్పినచొప్పునఁ దప్పకజేసెద" మని వార లావెంటనే కుండలలోనికల్లంతయు దొన్నెలలోఁ బోసికొని కంఠములవఱకుఁ ద్రావినారు. అత్యుత్సాహమునఁ గత్తులు కఠారులు మున్నగువానిని బట్టుకొని బైలు వెడలినారు.

౨

సూర్యుఁ డప్పుడే క్రుంకినాఁడు. ఎల్లెడ నల్లనిచీఁకటులలముకొనఁ జొచ్చెను. ఆకసమునంతయు గాఢమగు మబ్బులావరించినవి. ఉఱుములు, మెఱుములు మిక్కుటముగ నుండుటచేఁ గానన మంతయు భీతిఁ గొల్పుచుండెను.

అట్టిసమయమున నా గహనమందొకమూల నొక బాలిక తిరుగుచున్నది. ఆయడవిచేరువనేకల యొకపల్లెనుండి విహారమునకై యామె బయలుదేఱి ప్రొద్దుపోవుటచే దారిఁదప్పి యాయడవిని బ్రవేశించినది. ఏమిచేయుటకును దోఁచక భగవంతుఁడా! యని నిట్టూర్పు విడచుచు మతిచెడియిటునటుఁ దిరుగుచున్నది. ఆమె పదునాల్గువత్సరముల ప్రాయముఁ గలది. పరమసుకుమారి. ఆమెమృదుపాదములకు, రాళ్లు, ముండ్లు మొదలగునవి గ్రుచ్చుకొనుటచే నింతింతనరానిబాధ నొందుచు నుఱుముఱుమునకుఁ గంపించుచు మెఱుపుమెఱుపునకుఁ దల్లడిల్లుచుఁ బెద్దపెట్టున రోదన మొనరింప సాగెను.

దూరముగ వినవచ్చు నీబాలికరోదనధ్వని చోరులచెవినిఁ బడినది. "ఆహా! స్త్రీకంఠమే." యని వారు సంతోషమునఁ గంతు లిడుచుఁ బరుగెత్తుకొనివచ్చి మెఱుపులకాంతిలోఁ దళతళలాడు నాబాలికను బట్టుకొనిరి. ఇద్దఱుదొంగ లామెహస్తములను గట్టిగాఁ బట్టుకొనిరి. వారియాకారములను, చేష్టలను

జూచినంతనే యామెకు స్మృహ తప్పిపోయెను. పిమ్మటఁ గొంత సేపున కొక్కింత తెలివినొంది గడగడ వణఁకిపోయినది. శరీర మంతటను ముచ్చెమటలు గ్రమ్మినవి. గుండెలు దడదడఁ గొట్టుకొనసాగెను. నోట మాటవచ్చుట కెంతో కష్ట మయ్యెను.

"తండ్రులారా! నాపల్లెనుండి విహారమునకై చను దెంచి దారిఁదప్పి యీ నట్టడవిలో నల్లలాడుచుంటిని. దయ యుంచి నన్ను నాయింటికిఁజేర్చి పుణ్యముఁ గట్టుకొనుఁ" డని యాబాలిక వారల నతిదీనముగ వేఁడుకొనెను. వారామె ప్రార్థన మాలింపక యరణ్యమధ్యమున కామె నీడ్చుకొనిపోవఁదొడఁగిరి.

సౌందర్యవతియగు నాయువతిరక్తముఁ గాళికమెంతో యానందమునఁ ద్రావుననియు, నామెయంగములఁ బొంగుచు నార గింపఁ గలదనియు, వారలు చెప్పుకొనుచు "జయా! కాళికా దేవీ! జయా!! మహాశక్తి" యని దిక్కు లదటిపోవునట్లు కేకలువైచుచుఁ బోయి కొంతవడికి నాయకుని సమీపించిరి.

ఖడ్గపాణియై వీరలరాక కెదురుచూచునాయకుఁ డాయ న్నులమిన్నను గాంచి యీయువతి కాళికాశక్తికి బలియీయఁ దగినదని మనమున సంతోషించుచు దొంగలను జూచి చిఱు నవ్వు నవ్వినాఁడు.

"తండ్రీ! నిరపరాధినగు నన్నీక్రూరులబాఱినుండి తప్పించి నాగృహమునకు నన్నుఁ జేర్చి పుణ్యముఁ గట్టుకొ నవా?" యని యాబాలిక దొంగలయేలికపాదములపైఁబడి

బిగ్గఱగా నేడువసాగెను. కాని నరహంతకుఁడగు నా నాయకుఁడామెదీర్ఘతరకేశబంధముఁ జేతనొడిసిపట్టుకొని బిరబిరనామె నీడ్చుకొనిపోయి కాళికయెదుట నిలువఁబెట్టినాఁడు. తనచేతియందలి నిశితాసి నాడించుచు నాయబలను జడిపించినాఁడు.

ఆబాలిక తనకిఁకఁ జావునిశ్చయ మనియెంచి కంటికి మంటికి నేకధారగా నేడ్చుచు "ఓపరమేశ్వరా! నేనిక్కడ దిక్కుమాలినదాననై చావ సిద్ధముగ నుంటిని. దీనరక్షకుఁడవగు నీ విప్పుడు నన్ను రక్షింప వేఁడుకొనుచున్నా" నని బిగ్గఱగ నేడ్చుచు జాలిఁగొలుపు చూపులతో దొంగలనాయకుని మొగము వీక్షించెను.

నాయకుఁడు "తల్లీ! మహాదేవీ! కాళీ! కరాళీ!" యని బిగ్గఱగ నఱచుచు నెడమచేతితో నాపూఁబోఁడి తలముడి నటులనె పట్టుకొనియుండి కుడిచేతిలోఁగల వాడిఖడ్గముచే నామె కంఠమును నఱకుటకై పైకెత్తినాఁడు.

ఆజవరాలిదీనవీక్షణము లాతనివదనమునందే నిలిచి యున్నవి. ఆచూపు లాతనిమనసులో నొక్కమెఱపు మెఱయఁజేసినవి. ఎత్తినచేయి యెత్తినట్లే యుండెను. కోపముచే నెఱ్ఱనగు నాతనినేత్రములనుండి బాష్పములు రాలినవి. కఠినమును క్రూరమును నగు నాతనిమనస్సు మెత్తనై పోయినది. మొగమునందుఁ గరుణరస ముదయించినది. చేతిలోని కేశబంధ మూడి పోయినది. కత్తి జాఱిపోయినది.

## 3

ఆతనిహృదయమునఁ గలిగిన దుర్బలత్వమున కాతఁడే విస్మితుఁ డాయెను. "అకటా! నా కెన్నఁడునులేనియవశత్వము నేఁ డెటుల సంభవించెను? నే నెందఱిబాటసారుల తలలనో బ్రద్దలుగొట్టి వారిసొమ్ముల నపహరించితినే! లెక్కకు మించినస్త్రీలను, పసిబిడ్డలను నా నిశితకరవాలముచే నఱికి వారి రక్తధారల నీకాళికాదేవి నభిషేకించితినే. నేఁడు నాహృదయమున నీకరుణరస మేల? నాకన్నులలో నీయశ్రువు లేల? నాకిదియంతయు మాయగానున్నదే" యని నిశ్చేష్టుఁడై పోయెను.

పిమ్మట నాతఁడు కాళికవైపు చూచెను. ఆమెకుఁ గోపము వచ్చిన ట్లాతఁడు గ్రహించెను. రెండుచేతులును జోడించి "తల్లీ! ఇంతవఱకు నేఁ గావించిన ఘాతుకకృత్యములకు లెక్కలేదు. జాలిఁ గొల్పెడి యీబాలికామణివీక్షణము లిప్పుడు నన్ను బూర్తిగ మార్చివేసినవి. నీరౌద్రాకారము నుపసంహరింపుము. నన్ను నీక్రోధాగ్నులచేఁ గాల్చి భస్మము నొనరింపఁ దలఁచినను నిఁక నిట్టి క్రౌర్య మిసుమంతయైన నాచరించుటకు నాచేతు లాడవు" అని వచించి యాదేవియెదుటినుండి యాబాలిక నీవలికిఁ దీసికొనివచ్చెను.

నాయకునిచర్య దొంగ లందఱకు నాశ్చర్యముగఁ దోఁచెను. ఈతనిచేతఁగాకపోయినచో మనమే యొక్కనిమ

సములో నీమెశిరస్సుఖండించెద" మని వారా నారీమణినిఁ బట్టుకొనుటకుఁ బ్రయత్నించిరి. కాని నాయకుఁడు వారిని వారించెను.

అచ్చటనే యొక చెట్టుకొమ్మపై రెండుపక్షులు కూర్చుండియున్నవి. ఒకదొంగ యాపిట్టలను బట్టి చంపుటకై యత్నించుచుండెను. నాయకుఁ డది గాంచి పరువుపరువున వానిచెంత కేఁగి "నాయనా! అంతమధురముగ, నంతయానందముగఁ గంఠమెత్తి గాన మొనరించెడి యాపక్షులు నీకేమియపకార మొనరించినవి? వానిగానము వినుటకు నీ విష్టపడవా? వాని వింతవింత రంగులశృంగారము నీహృదయమును రంజింపఁ జేయుదా? నీ వింతటినుండి వాని నెన్నఁడును జంప నెంచకు" మనిచెప్పి వానిని మఱల్చెను. పిమ్మట నావైపునకే రెండు హరిణము లేతెంచెను. మహానందమున నృత్య మొనరించెడి యాలేళ్ల నింకొక చోరుఁడు చంప బాణము సంధించెను. వానినిగూడ నట్లే నాయకుఁడు వారించెను.

దొంగలనాయకుఁ డాబాలికను నిరపాయముగ నామె స్వగృహమున కనిపెడి యేర్పాటు లొనరించినాఁడు. ఆమెను జంపఁ దలఁచినప్పు డాతని హృదయమున మెఱసిన మెఱపే యాతనిని సంపూర్ణముగ మార్చివేసినది. అతఁ డొనరించిన క్రూరకృత్యముల నన్నిటిని దలఁచుకొని పశ్చాత్తాపము నొంది నాఁడు. తనహృదయము లోని కాఠిన్యము, క్రౌర్యము,

మొదలగున వన్నియుఁ గఱఁగి పోయినవి. కనులనుండి జొట జొట బాష్పములు కాఱినవి. దయాంతరంగుఁడై ప్రపంచ మందలి సర్వసృష్టిని ప్రేమించినాఁడు. దొంగల నాయకుఁడు క్రొత్తజీవనముఁ దాల్చి తనపాపము బద్దలు జేసికొనుటకై భగవంతు నారాధించుట కొకచెట్టు క్రిందఁ గూలఁబడినాఁడు.

ఎన్నో యుగములు కడచిపోయినవి. శోషించినచేతు లట్లే యున్నవి. తలయంతయు జడలుకట్టినది. శరీరమందంతయుఁ బుట్టలు పెట్టినవి. తన్నుదానే మఱచిపోయినాఁడు. దొంగల నాయఁకుఁడు వాల్మీకి యయినాఁడు.

కొంతకాలమున కీశ్వరుఁడు ప్రత్యక్షమై పశ్చాత్తప్తుఁడగు నా వాల్మీకిమహర్షిపాపములను క్షమించినాఁడు. "శ్రీమన్నారాయణ సంకీర్తనమునం దనవరతముఁ దనమన సుండున ట్లనుగ్రహింపు" మని వాల్మీకి కోరికొనినాఁడు.

హిమాలయ సదృశములైన యున్నతభావములు వాల్మీకివి. ఆతని హృదయమునుండి వెలువడిన గంగాప్రవాహము యుగయుగాంతముల వఱకుఁ బ్రవహించు చున్నది. ఆమధురగానము దిక్కుల నతిశయిల్లినది.

# జీన్ వాల్జీన్-మతగురువు.

౧

జీన్ వాల్జీన్ చాలఁ బొడవరి. మిగుల బలిష్ఠుఁడు. పెండ్లి కానివాఁడు. బీదస్థితియం దున్నవాఁడు. విద్యావిహీనుఁడు. కూలివలన జీవించువాఁడు. ఆతని కొక వితంతుసోదరి కలదు. ఆమె కిద్దఱు కుమార్తె లుండిరి. ఆమెబిడ్డలతో నన్నగారి నాశ్రయించుకొనియుండి జీవనముఁ గడపుచుండెను. జీన్‌వాల్జీన్ తాను కూలిపనిఁజేసి తెచ్చిన పైకమును సోదరి కిచ్చుచుండును. ఆమె భోజనము వండి యన్నగారికిని, దనబిడ్డలకును బెట్టి పిమ్మటఁ దాను దినుచుండును. జీన్‌వాల్జీన్ తనమేనకోడండ్రను గన్నకూతుండ్రవలె నెక్కుడుదయతోఁ జూచుచుండెను. ఆతఁడు ప్రతిదిన మింటికిఁ బోవు నపుడెద్దియేని ఫలాహారమును గొనిపోయి వారల కిచ్చుచుండును. ఆతఁడు తనచెల్లెలిని, బిడ్డలను బోషించుటకై యెట్టికష్టతరమగుపనుల నైనఁ జేయుచుండును. ఒక్కొక దినమున నెక్కుడు పని దొఱకకున్నచో నానాఁటికూలి తమనలువురిభుక్తికి సరిపోదనియెంచి చీఁకటిపడునంతవఱకు గ్రామమం దంతటను దిరిగి తిరిగి మఱలఁ గొంత కూలి సంపాదించుచుండెడివాఁడు. ఇట్లు దినములు గడచిపోవుచుండెను.

ఆతనికి దురదృష్టదినములు వచ్చినవి. ఒకనాఁటి యుదయముననే యాతఁడు తోఁటలోనికిఁ బోయినాఁడు. పనికొఱకై

పలుచోట్లం దిరిగినాఁడు. సాయంకాల మైనను నాఁ డాతని కెవ్వరు నెట్టిపనియుఁ జెప్పియుండరైరి. ఆదిన మంతయు గాలితోఁ బెద్ద వర్షముగూడఁ గురిసినది. ఆతని కేమిచేయుట కును దోఁచినదికాదు. అతఁడు తన కొకదినమునఁ గాదు నాలుగుదినము లన్నము లేకపోయినను సహించుకొనఁ గలఁడు. కాని నో రెఱుఁగని చిన్నిపాప లొకనాఁడు భోజనము లేకయుం డుట కాతని కంఠమునఁ బ్రాణవాయువు లున్నంతవఱ కిష్ట పడఁడు.

అప్పుడే ప్రొద్దు క్రుంకినది. ఆతని కొకకానియైన లభిం పలేదు. ఆతనికి సోదరియు బిడ్డలును జ్ఞప్తికి వచ్చిరి. "నా సహోదరి నారాకకై నిరీక్షించుచు మిక్కిలి చింతించు చుండును. చిరుతిండి కలవాటుపడిన చిన్నిపాపలు నాకొఱకై యెంతపరితపించు చుందురోగదా? ఆఁకలిచే వారలకడుపు లెంత మండిపోవు చుండునోగదా?" అని యీవిధముగ మనమునఁ దలపోయుచుఁ బిచ్చియెత్తినవానివలె గ్రామమం దంతటను మఱలమఱలఁ దిరుగుచుండెను. వర్షమింకను భోరుమని కురి యుచునే యున్నందునఁ దన గుడిసె యీసరికి భూమిపైఁ గూలియుండు నేమోయను భయ మాతనికి మిక్కుటముగ జనించినది. ధనముమీఁదను ధనవంతులమీఁదను నాతని కెంతయోకోప ముదయించినది.

అతఁ డొకయెడ నొకరొట్టెల దుకాణమును గాంచెను. ఆరొట్టెలు తనబిడ్డలయాఁకలి నొక్కత్రుటిలోఁ బోఁగొట్టఁ గలవని యాతఁడు తలఁచెను. కాని యవి తనకు లభించు టెట్లు? కొనుటకుఁ దనయొద్ద నొక్కపైసయైన లేదు. తనదుస్స్థితియంతయు దుకాణదారునితోఁ జెప్పి రెండురొట్టె లడిగి తీసికొని పోవుద" మని యుద్దేశించెను. కాని, యడిగినచో నాతఁ డొసఁగఁడేమో, అడుగకుండఁ గొనిపోవుటయే మంచిదని యూహించెను. కొంచెము ముందరి కరిగి చెప్పకుండ దొంగిలించుకొనిపోవుట తప్పుగాదా? అని మఱల యోజించెను. కాని నేనును, నాసహోదరియుఁ బిడ్డలును నాఁకలిబాధచే దేవుఁడాయని యేడ్చుచుండ నేనివి యెట్లయినఁ గొనిపోవుటలోఁ దప్పేమున్నది. అని తుదకు నిశ్చయించుకొనినాఁడు.

దుకాణమును సమీపించి యరుగుమెట్లపై కాతఁడెక్కినాఁడు. అద్దపుఁ దలుపులగుండ లోనికిఁ జూచినాఁడు. ఎవ్వరును గాన్పింపలేదు. తనబలిష్ఠములగు బాహువులను దొందఱగ ముందునకుఁ జాఁపినాఁడు. ఆతని బాహువేగమున కాయద్దము పగిలిపోయినది. పెద్దధ్వని యైనది. ఆధ్వనికిఁ జాటున నిదురించు దుకాణదారునికి మెలఁకువ కలిగినది. తోడనే యతఁడీవలకుఁ బరుగెత్తుకొనివచ్చి "దొంగ దొంగ పట్టుకొనుఁడు పట్టుకొనుఁ" డని కేకలు వైచినాఁడు. అచ్చటివా రందఱును బరుగెత్తుకొనివచ్చి జీన్‌వాల్జీనును బట్టుకొనిరి. చాలమంది జను

లాతనిచుట్టును జుట్టుకొనిరి. పోలీసుభటులు వెంటనే వచ్చి యాతనిఁ బట్టుకొని కారాగృహమునకుఁ దీసికొని పోయిరి. ఆరాత్రి యంతయుఁ దనబిడ్డ లాఁకలిబాధచే నెంతతల్లడిల్లు చుండిరోయని యాతఁ డింతిం తనరాని దుఃఖమొందెను. మఱు నాఁడుదయమున న్యాయాధికారి యొద్దకుఁ దీసికొని పోవుటకు భటు లాతని గొట్టునుండి బైటికిఁ దీసి న్యాయస్థానమునకు నడిపించుచుండిరి. జీన్‌వాల్జీన్ మనస్సులో నేదో యాలోచన పుట్టినది. తనచేతినిఁ బట్టుకొనిన భటు నొక్కని నొక దెబ్బ గొట్టి విడిపించుకొని తొందరగఁ దన యింటివైపునకుఁ బరుగెత్త సాగినాఁడు. తోడనే రెండవభటుఁ డీలవైచినాఁడు. పలువురు భటులు పరుగుపరుగున వచ్చి యాతనిఁ బట్టుకొని గట్టిగ బంధించి చేతి కరదండములఁ దగిల్చి న్యాయస్థానమునకుఁ గొనిపోయిరి. ఇప్పుడు నేరముపై నేరము వచ్చినది. రెండవనేరము మిక్కిలి పెద్దదై పోయినది.

న్యాయాధిపతి యావద్వృత్తాంతము విచారణఁ జేసి "నీరెండునేరముల కేమిజవాబిచ్చెద" వని యడిగెను. ఆఁకలిబాధ సహింపలేక మా కాపూటకు సరిపడు రెండురొట్టెలను మాత్రము దీసికొంటిని. నాప్రాణసమానలగు మేనకోడండ్రనుజూడ నేఁగుద మనెడి యభిలాషచే నన్నుఁ బట్టుకొనియున్న భటునిఁ గొట్టితిని. అంతలో న న్నందఱువచ్చి పట్టుకొని బం

ధించిరి. ఏమిచేసినను మీచిత్త" మని యాతఁడు ప్రత్యు త్తర మిచ్చెను.

న్యాయాధిపతి యాతని కైదుసంవత్సరములు కఠినశిక్ష విధించెను. భటు లాతని దూరగ్రామమునకుఁ గొనిపోయి యచ్చటఁ గారాగృహమందునిచి వానిచే మిక్కిలి కఠినము లగుపనులఁ జేయించుచుండిరి.

౨

నాలుగుసంవత్సరముల పదునొకండు మాసముల యిరువది దినములు కడచినవి. జీన్‌వాల్జీనికిఁ బదిదినము లోపికఁ బట్టినచో విడుదల కాఁగలఁడు. కాని పదిదినములుఁ బదియుగములవలె నాతఁడు భావించెను. ఆనాఁటి సాయంకాలము భటు లెప్పటివలె జీన్‌వాల్జీనునకుఁ దిండి పెట్టి తిరిగి యాతని గొట్టులోఁ బెట్టి యెప్పటివలెఁ దాళమువైచి యావలఁ గావలి యుండిరి.

రాత్రి పండ్రెండుగంటల వేళయైనది. భటులు మైమఱచి నిదురఁ బోవుచుండిరి. జీన్‌వాల్జీను కారాగృహపు టినుపశలువులను బట్టుకొని నిలువఁబడి పరధ్యానముగఁ గొంతసే పీవలకు దృష్టిఁ బఱపెను. తోడనే గిఱ్ఱున లోనికిఁ బోయి చాపపై వెల్లకిలఁ బరుండెను. ఆకాశమునఁ దలఁపు లొకదాని వెనుక నొకటి నీలమేఘములవలెఁ బరుగెత్తినవి. దీర్ఘాలోచన

చేనాతని తలయంతయు బరువై పోయినది. ఇఁకనొక నిముష మైన నా కారయం దుండుట కాతనికి దుర్భరముగఁదోఁచెను. తన సహోదరియుఁ, బిడ్డలును దనయెదుట నిలువఁబడి తన్నావలకు రమ్మని సంజ్ఞఁ జేసిన ట్లాతఁడు భ్రమఁ జెందెను. లేచి నిలువఁబడి యేమి చేయుటకునుఁ దోఁచక యున్మత్తునివలె నా చీఁకటిగదిలో నటునిటు దిరుగాడఁ జొచ్చెను.

అందఱును గాఢముగ నిదురఁ బోవుచున్నారు. కారాగార మంతయును నిశ్శబ్దముగ నున్నది. ఇంతకాల మాతఁడు చెఱయం దున్నను నాతనిశరీరములోని బలము మాత్ర మిసుమంతయు తగ్గలేదు. ద్వారముదరికి వచ్చినాఁడు. ఇనుపనారసములను రెండుచేతులతోను బట్టుకొని తనబలము నంతయు వినియోగించి రెండునారసములను రెండువైపులకు వంచివేసినాఁడు. మెల్లగ నా నారసముల మధ్యనుండి దూరి యీవల కరుదెంచి నలువంకలఁ బరికించి కాలుకొలఁది పాఱిపోవ సాగినాఁడు. అంతలోఁ గావలిభటుఁడు మేల్కాంచి యాతనిఁ బరికించి బిగ్గరగఁ గేకలు వైచినాఁడు.

తోడనే తక్కినభటు లందఱును లేచి జీఁవాల్జినువైపునకుఁ బరుగెత్తినారు. ఆతఁ డింకను జుట్టుగోడను దాటక మునుపే భటులందరు నాతనిఁ జుట్టుకొని కొంతవడికిఁ బట్టుకొని యాతని కాలుచేతులకునినుప గొలుసులను దగిలించినారు.

మఱునాఁ డతనిని న్యాయస్థానము నకుఁ దీసికొని పోయిరి. విచారణ జరిగినది. తిరిగి యాతని కైదువత్సర

ములు కఠినశిక్ష విధింపఁ బడెను. ఇదియుఁ గాక నతఁడు కారాగారమున సరిగ నడచుకొనక పోయినందులకేమి, భటులను గొట్టినందులకేమి, యింకొక నాలుగు సంవత్సరముల శిక్షకుఁ గూడ మఱలఁ బాత్రుఁ డయ్యెను. పాపమాతఁ డిఁకఁ బది దినము లోపికఁ బట్టినచోఁ దనసోదరిని, బిడ్డలను జూచుకొని సంతోషముఁ బొందఁజాలి యుండునుగదా ! పదిదినములు కంష్టము సికొని కడపఁజాలనివాఁ డిఁకఁ దొమ్మిది వత్సరములెట్లు గడపఁజాలునో ?

తొలుదొల్త నాతఁ డంతదుష్టుఁడు గాకపోయినను, నిరంతర దుస్సహావాసముచేతను, నెడతెగని కట్టుబాట్లచే నిరాశాపూరితుఁ డగుటచేతను నాతని దౌష్ట్యము వృద్ధి యయ్యెను.

ఎట్లో తొమ్మిది సంవత్సరము లాతఁడు కఠినశిక్ష ననుభవించినాఁడు.

"క్రూరుఁడగు జీన్‌వాల్జీన విడుదల యగుచున్నాఁడు. కావునఁ బ్రజ లెల్లఱు జాగరూకులై యుండుఁ" డని పోలీసువారు చాటింపుఁ జేయించి యాతని ముఖముపై "గజదొంగ" యను నక్షరములు వ్రాఁతవేసి విడిచిపెట్టిరి.

## 3

జీన్‌వాల్జీను విడుదల యైనాఁడు. కారాగారమునుండి యాతఁడు వెలుపలి కరుదెంచుచున్నవార్త విని యాపట్టణము

లోని ప్రజ లెల్లఱు వీథులలో రాకపోకలే మానుకొనిరి. అతనిఁ జూచినవా రెల్లఱుఁ దమతమ వీథిగుమ్మపుఁ దలుపులను మూసికొనఁ దొడఁగిరి. దినమంతయు నాతఁ డాగ్రామమునఁ దిరిగినను నాతని కొక్క మనుజుఁ డైనఁ గానఁబడలేదు. అతని కాఁకలియు, దప్పికయును, విపరీతముగఁ గలుగుచుండెను.

తుద్దకు రాత్రి యగుసరి కొకయింటి గుమ్మముదరి కాతఁ డేతెంచినాఁడు. ఆయింటి తలుపులు తెఱువఁబడియే యున్నవి. "దాహము మిక్కిలి బాధించుచున్నది. కొంచెము మంచి నీ రిచ్చి పుణ్యముఁ గట్టుకొనరా!" యని యాతఁ డఱచెను. లోపలినుండి యెవ్వఱో యొకచిన్న దీపమును గొనివచ్చి యాగ్రుడ్డివెలుతురులో నాతని మొగముపైఁ గాల్చఁబడి యున్న యక్షరములఁ జూచి "అమ్మో!" యని యఱచి లోనికిఁ బరుగెత్తిరి. ఇంకొక రావెంటనే వచ్చి తలుపులను మూసివైచిరి. ఇట్లే జీన్‌వాల్జీనును బ్రజ లెల్లఱు బహిష్కరించిరి.

అతఁడు మఱికొంతసేపున కింకొకయింటిదగ్గర కేఁగి నాఁడు. ఆయింటితలుపు లన్నియుఁ దెఱువఁబడియే యున్నవి. లోపల దీపము వెలుఁగుచున్నది. ద్వారముచెంతకుఁ బోయి "అమ్మా! అమ్మా!" యని మెల్లగఁ బిలిచినాఁడు. లోపలినుండి యొక మగవాఁ డీవలకు వచ్చినాఁడు. దీనవదనముతో నిలువఁబడియున్న జీన్‌వాల్జీనును జూచి రెండుచేతులను జాఁచి

"నాయనా! నీకొఱకే నేనింతవఱకు వేచియున్నాను. దయామయుఁడైన పరమేశ్వరుఁడు నీబోఁటి పాపాత్ములకొఱకై వేచియుండుమని నా కానతిచ్చినాఁ" డని చెప్పుచు నాతనిఁ గౌఁగిలించుకొని లోనికిఁ దీసికొనిపోయినాఁడు.

ఆతఁ డొకమతగురువు. తన సేవకులను బిలిచి యాతనికి ముందుగఁ బానీయ మిప్పించినాఁడు. పిమ్మట స్నానముఁ జేయించి కట్టుకొనుటకు మంచివస్త్రముల నిచ్చినాఁడు. అటు పిమ్మట ననేకభక్ష్యభోజ్యములతో నాతనికి భోజన మిడినాఁడు. భోజనానంతరము పండుకొనుట కొకమెత్తని పరుపు నిచ్చినాఁడు. జీన్‌వాల్జీనునకుఁ గలిగిన సంతోషమునకు మేర లేదు. తెల్లని మెత్తని యాశయ్యపైఁ బండుకొనినాఁడు. పాపము పగలంతయుఁ దిరిగితిరిగి యలసి పోవుటచే నాతని కావెంటనే నిద్ర పట్టినది.

ఆయింటిలో నెల్లెడల నిశ్శబ్దముగ నున్నది. తెల్లవాఱ వచ్చుచున్నది. జీన్‌వాల్జీను మేల్కాంచినాఁడు. కడచినదిన చర్యయంతయు జ్ఞప్తికి వచ్చినది. జీవిత మంతయు నిట్లే యున్నచో నిఁక బ్రదుకు టెట్లని యాతఁడు తలఁచెను. ఆతనికిఁ దన సోదరియు, బిడ్డలును, జ్ఞప్తికి వచ్చిరి. వెంటనే స్వగ్రామమున కేఁగ నిశ్చయించుకొనెను.

"ఇంతకాలము నేను వారలకు దూరమై పోతిని. ఇప్పుడు వారల కేమి తీసికొని పోవుదును? ఇట్టిస్థితిలో నున్న

నే నేమిసంపాదింపఁ గలను?" అని యాతఁ డాలోచించు కొను చుండెను. తన కెదురుగనున్న బీరువాయందు రెండు వెండి చెంబు లాతని కగపడినవి. వానినిఁ దీసికొని పోఁదలఁచెను. తా నదివఱకు భోజనముఁ జేసినగదిలో రెండు వెండిగిన్నెలు కలవు. వానినిఁగూడఁ గొనిపోవుట కాతఁ డూహించెను. తత్క్షణమే లేచినాఁడు. బీరువాతలుపులు తెఱచియే యున్నవి. రెండు వెండిచెంబులను, రెండుగిన్నెలను, దీసికొని మెల్లగ వీధిగుమ్మముఁ దెఱచి బైటికిఁ బోయినాఁడు.

ఇంతకన్న ఘోరమైన ద్రోహ మున్నదా? ప్రపంచ మంతయుఁ దన్ను బహిష్కరించి భయంకరరాక్షసునివలెఁ జూచినప్పుడు దయతోఁ దన్నాదరించి యన్నపానీయము లొసఁగిన యా మతగురువు నెడలఁ దా నెంతటి కృతఘ్నతను జూపినాఁడు?

తెల్లవాఱినది. జీన్ వాల్జీ నొక మైదానము వెంబడి స్వగ్రామాభిముఖుఁడై పోవుచున్నాఁడు. వెండిగిన్నెలు పై కగపడకుండ బావుఱువులసందున నిఱికించికొని శరీరముపై నొక బట్టఁ గప్పుకొనియుండెను. కొంతదూరముపోయిన పిమ్మటఁ గొందఱు పోలీసుభటు లాతని కెదురుపడిరి. చిరపరిచితు లగుటచే నతనిని బలుకరించి యాతని గమ్యస్థానాది

కమును బ్రశ్నించిరి. జీన్‌వాల్జీను వారలను గాంచి కొంచెము తొట్రుపాటుఁ జెందెను. ఎదియో యాతనిచంకలో దాఁచి నాఁ డని గ్రహించి పోలీసుభటు లాతనిచేయిఁ బట్టుకొని కట్టిక లాఁగిరి. వెండిగిన్నెలు క్రిందఁ బడినవి. వీని నెచ్చట దొంగిలించితి వని వా రాతని బంధించి మిక్కిలి బాధించిరి. ఆగిన్నెలపై మతగురువు పే రున్నది. ఆమతగురువు తన కవి బహుమతి నొసఁగెనని జీన్‌వాల్జీను బొంకెను. "అట్లైన ని న్నాతనియొద్దకుఁ దీసికొనిపోయెదము" రమ్మని బలవంతముగ నాతని నీడ్చుకొనిపోవఁదొడఁగిరి.

జీన్‌వాల్జీనునకుఁ గా ళ్లాడినవికావు. అధైర్యమువలన నాతనిశరీరములోని బల మంతయు నశించినది. మొగమున నెక్కడను రక్తపుఁజుక్క లేదు. హృదయ మల్లకల్లోల మైనది.

తన కిఁక నీజన్మమున సోదరిని, బిడ్డలను జూచుభాగ్యము లేదను కొన్నాఁడు. ప్రపంచము మీఁదియాసయే యాతనికి నశించినది. "అకటా! నే నిఁక మతగురువు నేమొగము పెట్టుకొని చూడఁగలుగుదును? అంతటి యుపకారముఁ గావించిన తన కిట్టి యుపకార మొనరించినందులకు నాయెడలి చర్మ మొలిపించునుగాని నన్నాతఁడు క్షమించునా? నా కిఁక శాశ్వతముగఁ గారాగృహవాసము తటస్థించు నేమో?" యని యాలోచించుకొనుచు నడచెను.

# అశోకుఁడు—యుద్ధభూమి.

౧

నందవంశము నంతయు సమూలముగ నాశన మొనర్చి చంద్రగుప్తుఁడు మగధసామ్రాజ్యము సంపాదించెను. పాటలీపుత్ర మాతని రాజధాని. ఆతని కుమారుఁడు బిందుసారుఁడు నర్మదాకృష్ణాస్రవంతులమధ్యనున్న రాజ్యములలోని రాజవీరుల నందఱను జయించి రాజ్యసంపాదన మొనరించుటయేకాక "అమిత్రఘాతుకుఁ" డను పౌరుషనామమునుగూడఁ బడసెను.

అట్టివిజిగీషువులవంశమునందే నా బిందుసారునికడుపున నశోకవర్ధనుఁడు జన్మించెను. బిందుసారుఁ డీతని దక్షశిల, యుజ్జయిని మొదలగుప్రదేశములకుఁ దనప్రతినిధిగా రాజ్యముచేయఁ బంచెను.

అశోకుఁడు యువరాజు. వినోదములయం దత్యంత కుతూహలము కలవాఁడు. తనవినోదములఁ దీర్చుకొనినతరువాతనే మెట్టిరాజకార్యములైనఁ జూచుకొనెడువాఁడు. నిరంతరము మాంసాదికాహారములచే బలిసి యుబుసుపోకకై గొఱ్ఱెపొట్టేళ్ల పందెములతోను, నేనుఁగులపందెములతోను గాలక్షేపము చేయుచుండెడివాఁడు. పాపము, నోరులేని యుభయప్రాణులను డీకొల్పి యవి తలలుపగిలి, నెత్తురులుగ్రక్కుచుఁ గూల్పడు చుండ యాతని కానంద మెట్లుప్పొంగునోగదా! ఆతఁ డెక్క

డకుఁ బోయినను చామరధారిణులగు యౌవనయువతులు వెంబడించివత్తురు. పేరునకుమాత్ర మశోకుఁడు తక్షశిలను బాలించుచుండెను, కాని నిజమైన బాధ్యతయంతయు మహారాజగు బిందుసారునిదే.

వినోదఖేలనములలో నెంతనిమగ్నుఁ డయ్యెను తనమనమున నశోకునకు సామ్రాజ్యతృష్ణ విపరీతముగ నుండెను. ఎట్లైనను దనయన్నదమ్ములను గాదని తానే సింహాసనమధిష్ఠింప లోలోపల నువ్విళ్లూరుచుండెను. యువరాజుగానున్నప్పుడే కొంతయు, నంతకుమున్ను తనతండ్రియొద్దనున్నప్పుడే కొంతయు మొత్తముమీఁద రాజ్యపరిపాలనాక్రమ మెల్ల నర్థము చేసికొనెను.

ఇట్లుండగా నిరువదియైదుసంవత్సరములు రాజ్యము చేసి వృద్ధుఁ డగు బిందుసారుఁడు పరలోకగతుఁ డయ్యెను. అతని కెందఱో భార్యలు కలరు. వారియందఱివలన నాతనికిఁ దొంబదియెనమండ్రు కుమారులు కలిగిరి. వారిలో కొందఱు బలవంతులు, కొందఱు చాల మంచిహృదయములుకలవారునైయుండిరి. రాజ్యసంపాదనమే ముఖ్యోద్దేశముగాఁగల యశోకుఁడు సింహాసనము నాక్రమించుకొనుట కట్టి కార్యముఁ జేయుటకైన శంకింపఁడు. అశోకుఁడు రాజౌటకు కొంద ఱనుమతించక యెన్నియో యాటంకములఁ గల్పించిరి. నిజమునకు నశోకునికంటె ముందుగా సింహాసన మధిష్ఠించుట కర్హు లగు జ్యేష్ఠులు

కలరు. రాజ్యాసక్తిచే నశోకుఁడు వారి నెల్లఁ బట్టించి వివిధ రీతులఁ జిత్రవధముఁ గావించెను.

నిర్దోషులును, నాతనియందు సదభిప్రాయము కలవారును గూడ నెందఱో యాతని క్రోధానలమునఁ బడి మ్రగ్గిపోయిరి. రాజ్యసంపాదనాపరత్వము తన సహోదరులయెడఁ గనుపఱుప వలసిన సుహృద్భావమును గూడ నశింపఁ జేసినది. దయాదాక్షిణ్యములకుఁ దావీయక మహాక్రౌర్యమునఁ దనసోదరుల రక్తముచే దడిపివైచినమగధరాజ్యమున నెన్నియుద్ధంబులు కలిగినను వాని నన్నిటి నాతని నిశితాసిచేఁ జెండాడి పాటలీపుత్రమున సింహాసనాసీనుఁడై యశోకుఁడే పట్టాభిషిక్తుఁ డయ్యెను.

అప్పటి కాతనికి హిమవత్పర్వతములకును మైసూరు దేశమునకును మధ్యనుండి ప్రాక్పశ్చిమసముద్రముల నంటుచున్న విశాలమైన రాజ్యముండెను. రాజ్యములోని యంతఃకలహము లన్నియుఁ దీరిపోయినవి. సామంతరాజు లెల్లఱుఁ దనకులోఁబడి కప్పములనుజెల్లించుచునే యుండిరి. కాని యశోకుఁడు తన తండ్రి తాతలవలెనే దిగ్విజయయాత్రకు బయలుదేర నూహించెను.

౨

ఆకాలమునఁ గళింగరాజ్యము సకలవైభముల నలరారుచున్నది. మహానదీగోదావరీనదులమధ్యభాగమే యప్పటి కళింగరాష్ట్రము. అశోకుని కన్ను లారాజ్యముపైఁ బర్వెనవి.

తమకు సామంతులుగా నుండవలసిన కళింగరాజులు స్వాతంత్ర్యమునకుఁ బ్రయత్నించుట తన కవమానహేతు వని తలఁచి దిగ్విజయమునకై గొప్పసైన్యమును దీసికొని బయలువెడలెను. చతురంగబలసమేతమయిన యా సేన పదునొకండువత్సరములెడతెఱపిలేక మిక్కిలిజాగ్రత్తతోఁ దరిబీయతు గావింపఁ బడినది. ఈ పదునొకండువత్సరములును యుద్ధభూమి కరుదేరక సైన్య మంతయు మదించియుండెను. "యుద్ధ మెప్పు డెప్పు" డని సైనికు లందఱు మిక్కిలి తొందఱపడిరి.

మహాటోపమున మిన్నుమ న్నదరిపోవున ట్లురుదెంచు మగధసైన్యములఁ గూర్చి చారులవలనఁ దెలిసికొని తమ వాహిని ననేకవిధముల బలపఱచి యెట్లైనఁ దనరాజ్యమును, స్వాతంత్ర్యమును నిలుపుకొన మంచిపట్టుపలతో నమరుకొనుటకు వలసినసన్నాహ మంతయుఁ గళింగాధిపతి యతిత్వరితముగఁ జేయించెను. ఉభయవాహినులును రణరంగమునందుఁ దారసిల్లినవి. కళింగసైన్యముకంటె మగధసైన్యము రెట్టింపు గలదు. ఎంతటిరక్తపాతమునైనఁ గావించి యీరాజ్యము నతఁడు గెలుచుకొను నని యశోకుఁడు చాటింపించెను. మహోత్సాహముతో రెండుపక్షములనుండియు గుండె లదరి పోవునట్లు భేరీభాంకారములు వినవచ్చుచున్నవి.

యుద్ధము జరుగుచున్నది. స్వాతంత్ర్యమునకై తుది రక్తపుఁ జుక్కవఱకును వెనుదిరుగక సమరముసేయు కళింగ

సైనికులతోఁ బదునొకండువర్షములనుండి యుద్ధమేలేక యొడలు క్రొవ్విన మగధసైనికులు తలఁపడిరి. పెట్టనిగోడలవలె నేనుఁగులు సైనికులనడ్డుచున్నవి. సముద్రతరంగములవలె గుఱ్ఱములు విజృంభించుచున్నవి. కత్తులతోఁ, గఠారులతో నొండొరులఁ బొడుచుకొనుచుఁ జెండాడుచు భటులు చంపుకొనుచుండిరి. ప్రతిదినము లెక్కకుమీఱినసైనికులు చచ్చుచున్నారు. హతశేషులు ముందునకువచ్చి మఱింతధైర్యముగాఁ బోరుచు నుత్సాహముతో వీరస్వర్గము నలంకరించుచున్నారు. రణరంగమంతయు మరణరంగ మయ్యెను. ఎక్కడచూచినను క్షతగాత్రులే. ఎచ్చటఁగనుగొన్నను రక్తపుఁగాల్వలే. తలవంపక వీరనికాయము మృతకళేబరములను ద్రొక్కుకొనుచుఁ బోయి తమశత్రువులతో యుద్ధముచేయుచుండిరి. ఒక్కొకచోఁ దమ బల్లెపుఁగొనలచే మృతకళేబరములను బ్రక్కకు దొరలించి ముందునకుఁ బోవుచుండిరి. బలమైనగాయములు తగిలియుఁ దమ కుయ్యాలించువారులేక "దాహమో" యనివేమారఱచి తుదకు గొందఱు చనిపోవుచుండిరి.

సుమారులక్షసైనికు లుభయసైన్యములలోను జచ్చిరి. వేలకొలఁది యశ్వములును వందలకొలఁదియేనుఁగులును మడిసినవి. ఏపక్షముకూడనింతవఱకు గెలిచినట్లు కాన్పింపదు. మహారాజగు నశోకవర్ధనుఁడుకూడ స్వయముగా రణరంగమున కేతెంచి మిక్కిలిజవసత్వములుగల నశ్వరాజ మొక

దానిపై నెక్కి తనచేతి కందినవారి నెందఱినో నిశితకరవాలమున వ్రయ్యలుచేయుచునే యున్నాఁడు. రాజున కిదియే మొదటి యుద్ధము. సమర మొనరించుట యనఁగ నెదిరిరాజులను లొంగఁ దీసికొని వారిరాజ్యమును దాను బొందుటయే యని యాతఁడు తలఁచెను. కాని కార్యసాధనమునం దెంతటిరక్తపాతమగునో, యెన్నిహింసాకృత్యములు జరుగునో, యేమియు నెఱుఁగని సాధుజనములు క్షామాదికమువలన నెంతగాఁ బీడింపఁ బడుదురో యాతఁ డూహింపలేదు.

పో రటులనే జరుగుచున్నది. తమయసమానమైనబాహుపరాక్రమమును, యుద్ధనైపుణ్యమును, గనుపఱుపవలసిన యద నదియే యని సైనికులనుహెచ్చరించుట కశోకుఁడు తనసేనానాయకున కుత్తరువొసఁగెను. సమరము తెఱఁ గతి భీభత్సముగ మారిపోయెను. కళింగసైన్య మెంతటిపట్టుదలతోఁ బోరినను నసంఖ్యాకమయిన మహారాజుసైన్యము నెదిర్చి జయింపలేక పోయినది. అశోకచక్రవర్తి యుద్ధమునఁ గళింగరాజ్యమును జయించెను.

## 3

హతశేషులైన కళింగసైనికులను బట్టుకొని బంధితులఁ జేయుటకు మగధసేనానికి నాజ్ఞయైనది. భేరీనినాదము లాఁగి పోయినవి. సైనికులయార్భాటములు సమాప్తిఁ జెందెను. అశో

కుఁడు మెల్లగయుద్ధభూమినుండి బయలుదేఱెను. చూచువారల కా రణరంగము మిగుల భీభత్సముగ నుండెను. తలలులేని మొండెములు, తెగిన చేతులు, విరిగిపోయిన కాళ్లు మిగులవీర జిమ్మినట్లు పడియుండెను. నెత్తురేఱులై ప్రవహించుచుం డెను. కఱుడుగట్టి నల్లబడిన కొన్ని మాంసఖండములు, నంత కుమున్నే తెగిన మొండెములనుండి స్రవించు నెత్తురుఁ జూచువా రలకు మిక్కిలిభీతిఁ గొల్పుచుండెను. కాకులు గ్రద్దలు మానవ శరీరములఁ బొడుచుకొని తినుచుండెను.

అచ్చటచ్చట పెద్దపెద్దగాయములుతగిలియుఁ, గాళ్లు తెగియుఁ, జేతులు వ్రేయఁ బడియుఁ జావక కొనయూపిరితో నున్న కొందఱుసైనికులు "అయ్యో, అబ్బా! దాహము! బాధ, దుర్భరము" అను నీరసధ్వను లశోకుని నాకర్షించినవి. "అయ్యో! దాహము, దాహము, దుర్భరము, బాధ" యనుచుఁ గేకలిడుచు నఱుకఁ బడిన పాదములపై నిలుచుటకుఁ బ్రయత్నించి మఱల నేలపైఁ గూలి ప్రక్కనున్న కళేబరము నుండి స్రవించు రక్తమును ద్రావుచున్న క్షతగాత్రు నొక్కని నశోకుఁడు కన్నులారఁ గాంచెను. అతని హృదయమున నవ్వాఁడు తటుకున నొక్క మెఱపు మెఱసెను. గడగడ వడఁకి నాఁడు. కుళ్ళిపోయినశవములకన్ను లశోకునకు భయమును గల్గించినవి. ప్రేగులు బయల్వడియున్న కొన్నిశరీరము లశో కునిహృదయమును లోఁ గొన్నవి. భయము చే నాతఁడు కను

ల్లోమూసికొనినాఁడు. మృతులైన సైనికుల బంధుగులు కంటికిమంటికి నేకధారగ విలపించుచున్న ట్లాతనికిఁదోచెను. భోజనములేక కఱవువలన నెన్నియో కుటుంబములు మలమల మాడిపోవుచున్న ట్లాతని యూహాపథమున గోచరించెను.

అతఁడు స్తంభితుఁడై పోయినాఁడు. ఇంతటి ఘోర కృత్య మొనరించి యిందఱప్రజల నేడ్పించి రాజ్యముసంపాదించుటకంటె వేఱొండు పాపము లేదని యాతఁడు గ్రహించెను. చేతియందలిక త్తిని జాఱవిడిచినాఁడు. యుద్ధభూమిలో మొక్కజిల్లి యున్ని ప్రాణులు తనవలన నశించినవిగదా యను విచారమున నశ్రువులు రాల్చినాఁడు. సంపూర్ణముగఁ బశ్చాత్తాపము నొంది గడియనే పచ్చుటనే ప్రార్థనసల్పినాఁడు.

మగధసైన్యములు మరలి పాటలీపుత్రమును జేరినవి. పాపనాశనమునకై యశోకుఁ డనేక పుణ్యకార్యములఁ జేసెను. పక్షులకును, జంతువులకును, మనుష్యులకును నెన్నో సౌకర్యముల నాతఁడు గావించెను. "అహింసాపరమోధర్మః" అను సిద్ధాంతమును ప్రబోధించిన బుద్ధభగవానుని యుపదేశమును శిరసావహించి దేశమంతయు నహింస నవలంబించు నట్లు శాసించెను. కళింగయుద్ధ మశోకుని బశ్చాత్తప్తుని గావించినది. ఆ పశ్చాత్తాపమే యాతని బౌద్ధభిక్షుని గావించి హైందవచక్రవర్తులలో నగ్రగణ్యునిగాఁ జేసినది.

పశ్చాత్తాపము పతితపావనము గదా!

---

| | | | |
|---|---|---|---|
| 1. కథానిధి | ... | ... | 0—8—0 |
| 2. పశ్చాత్తాపము | ... | ... | 0—6—0 |

దొరకువారు :—

కురుమెళ్ల వేంకటరావు,

పిఠాపురము.

